కరపత్రం నెం. 35

ప్రతులు 2000
మలి ముద్రణ : 1990



రచన : మల్లాది సుబ్బమ్మ




ప్రచురణ కర్త
స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
మెహిదీపట్నం—హైదరాబాద్
ఫోను : 35429

వెల : రు. 3-00 లు

ప్రతులకు :
స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
8, ఎం. ఐ. జి. హెచ్. మెహిదీపట్నం
హైదరాబాద్-500 028

ముద్రణ :
సౌజన్య ఆఫ్సెట్ ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ-3.

112
౨౨౧

# మహిళా జాగృతి : చైతన్యం

అమ్మా!

నీకు ఉత్తరం వ్రాసి చాల రోజులయింది. నిన్న నీవు వ్రాసిన రెండవ ఉత్తరం చేరింది. దీనిలో ఎన్నో వివరాలు, విషయాలు వ్రాశావు సంతోషం.

నీ ఉత్తరాలను భద్రంగా దాచుకున్నాను. 40వ ఏట నీవు అక్షరాలు దిద్దుకొని, చదవటం మొదలు పెట్టటం నాకు ఎంతో గర్వం కలిగిస్తున్నది. నా తల్లి ఎంత గొప్పదో ఇప్పుడిప్పుడే తెలుసుకుంటు న్నాను. చిన్నప్పుడు నా అల్లరితో నిన్ను ఎంతో విసిగించాను. ఎంత ఓర్పుతో, సహనంతో నీవు నన్ను పెంచి పెద్దదాన్ని చేశావో తిరిగి తలుచుకుంటూ ఉంటే నాకు సిగ్గు కలుగుతున్నది, అదే సమయంలో నీ తల్లి ప్రేమ గుర్తుకు వస్తున్నది.

అమ్మా! నేను నీ ఋణం తీర్చుకోతలచాను. దానికి ఒక పద్ధతి కనిపెట్టాను. నేను పిల్లల్ని కని నీకు మనుమలను, మనుమ రాండ్రను ఇవ్వటం కాదు నేను చేయతలచింది. ఇది ఒక క్రొత్త విధానం. నీవు నాకు చదువు చెప్పించి మంచి చెడ్డల తెలుసుకోగల బుద్ధిని యిచ్చావు. నేనిప్పుడు బాగా చదువుకున్నదాని క్రింద లెక్క. నేను ఇక్కడ ఇతరులకు ముఖ్యంగా విద్యార్థులకు, విద్యార్థినులకు పాఠాలు చెప్తున్నాను. నీ దయవల్ల ఇంతగా ఎదిగిన నేను నాకు తెలి సిన విషయాలు నీబోటిదానికి చెప్పడం వల్ల నీకేగాక, నీలోటి స్త్రీలకే గాక దేశానికి లాభం అనే నిర్ణయానికి వచ్చాను. కనుక ఆ పనికి పూనుకుంటున్నాను. చిన్నపిల్ల దానికేం తెలుసు అని నిర్లక్ష్యం చెయ్యకు. నేను ఎంతగా పెరిగినా, ఎదిగినా నీ కళ్ళ ఎదుట చిన్న పిల్లనే. అందుకు సందేహం లేదు. కాగా నీ కష్టాల ఫలితంగా నాకు కాస్త చదువు అబ్బింది. అది గుర్తుపెట్టుకుని నా ఉత్తరాలను కాస్త శ్రద్ధగా చదువు. అంతేకాదు నీతోపాటు వయోజన పాఠశాలలో

చదివే అత్తయ్యలకు, పిన్నిగార్లకు, అమ్మమ్మలకు, బామ్మలకు చదివి వినిపించు. అలా చేస్తావని నమ్ముతున్నాను.

అమ్మా! మన గ్రామాలలో స్త్రీలకు జాగృతితక్కువ. చైతన్యం అసలేలేదు. ఈ మాటవినగానే పెద్దవాళ్ళయిన మీకు సహజంగా కోపం వస్తుంది. పరవాలేదు. కొంచెం మీరు ఓపికగా చదివితే మీకే బోధ పడుతుంది నా మాటల అంతర్యం.

జాగృతి అంటే మెలకువగా ఉండటం. మెలకువగా ఉండక నిద్రపోతున్నామంటే పొద్దస్తమానమూ అని విసుక్కోవద్దు. మెలకువ అంటే మనము ఎలా జీవిస్తున్నామో, అది బాగా ఉందో లేదో అని వెనుకకు తిరిగి ఆలోచించుకోవడం అన్నమాట. మీరు కష్టపడుతు న్నారు నిజమే! మీరు రోజుకు ఏ ఆరుగంటలో తప్ప బండ చాకిరీతో సతమతమవుతున్నారు. అదీ వాస్తవమే. కాకపోతే ప్రతిరోజూ అదే పని చేసుకుపోతున్నా, ఎంతో బాధలకు లోనవుతున్నా దానిని గురించి మీరంతా ఆలోచించటం లేదు. అయితే మేము మటుకు మను ష్యులం కామా, మాకు మటుకు ఎప్పుడో ఒకప్పుడు మనస్సుకు కష్టం కలగటంలేదా, మేము మాత్రం కష్టాలను తలుచుకొని ఏడవటం లేదా అని మీరు నన్ను అడుగవచ్చును. ఇదీ జరుగుతున్నది. మరుక్షణమే మీరు కళ్ళ నీళ్ళు తుడుచుకొని మామూలు పనిలోకి వెళతారు. తరు వాత ఆ కష్టాలను గురించి మళ్ళీ ఆలోచించరు. దానికి కారణం మీకు మెలకువ లేకపోవడమే.

మనుష్యులుగా మనకు కొన్ని హక్కులున్నాయి. ఆ హక్కు లను మనం వాడుకోవాలి. అవి మనకు వాడుకలో లేకపోతే వాడుక లోకి తేవాలి. అనుభవంలోకి తెచ్చుకోవాలి. వాటిని అమలుపరచమని అడగాలి. అవసరమయితే వాటికోసం ఆందోళన చేయాలి. అప్పటికీ రాకపోతే పోరాటం సాగించాలి. పోరాటం అనగానే మీరంతా భయ

పడతారు. పోరాటం అంటే చంపడం, చావడం అని మీరు ఆదుర్దా పడుతున్నారు కదూ। అలాంటిదేమీ కాదు, దానికి అనేక పద్ధతులు ఉన్నాయి. అదంతా ముందు ముందు వ్రాస్తాను. ఇలా చేయడానికి పూనుకోవడాన్నే "చైతన్యం" అంటాము.

చైతన్యం అంటే కదలిక. మేము కదలకుండా పడివున్నామటే అని మీరు నామీద కోపం తెచ్చుకోకండి. ఒకరకంగా చూస్తే మీలో కదలిక లేదు. మీరు జీవిస్తున్న విధానంకన్నా వేరు పద్ధతులు ఉన్నాయని మీకు తెలియదు. తెలిసినా వాటిలో ఏవి మంచివో, ఏవి చెడ్డవో మీకు తెలియదు. మీకు అనుభవం లేదని కాదు. మీ అనుభవాలు మీ గ్రామానికి, ప్రక్క గ్రామానికి పరిమితం. మీ పుట్టినింటికి, మెట్టినింటికి మాత్రమే చెందుతాయి. ఇతర ప్రపంచంగురించి మావోటి వాళ్ళకు తెలిసినట్లు మీకు తెలియదు. మండలాలు, జిల్లాలు, రాష్ట్రాలు దేశాలు, ఖండాలు ఎన్ని ఉన్నాయో అక్కడ ఏమేమి జరుగుతున్నదో మీకు తెలియదు. అందువల్ల మీకు తెలిసిన అనుభవాలనుబట్టి మీరు నడుచుకుంటారు. అది చాలదు ఈనాడు. మనం మనుష్యులం చంద్రుని మీదకు పోయి అక్కడ దిగి అక్కడి నేలను కాలితో తట్టి, మట్టిని పారతో త్రవ్వి తిరిగి మనం భూమిమీదకు వచ్చే రోజులు. పూర్వం "కాశీకి పోయినవాడు కాటికి పోయినవాడు సమానమే" అనే వాళ్ళు. కాశీ అంతదూరం, ప్రయాణం అంత కష్టం. ఇప్పుడు నాలుగు గంటలలో వెళుతున్నాం. రోజులు మారాయి. ఇదంతా మేము చూస్తున్నాం, అనుభవిస్తున్నాం. అనుభవించిన వాళ్ళు వ్రాస్తుంటే చదువుతున్నాం. కనుకనే మాకు తెలుసు. చదివితే, చదవగల్గితే మీకూ తెలుస్తుంది. అప్పుడు మీరు ఈనాటి మీ జీవితంతో తృప్తి చెందరు. మీ జీవితాలను బట్టి చూస్తే మీరు "కూపస్థ మండూకాలు" అంటే బావిలో కప్పలన్నమాట. అంటే బావిలో కప్పకు బావిని

మించిన ప్రపంచం లేనట్లే మీకు మీ ఇల్లు, మీ బస్తీ, మీ వాడ, మీపేట మీ గ్రామం దాటితే అమ్మగారి ఊరు లేక అత్తగారి ఊరు ఇంతే మీ ప్రపంచం. మిమ్మల్ని తిడుతున్నానని అనుకోవద్దు. మీరంటే నాకు ఎంత ప్రేమో, అభిమానమో నాకు తెలుసు, మీకూతెలుసు. మీరంతా నాకు గోరు ముద్దలు, జంటికలు పెట్టిన వాళ్ళు. మిమ్మల్ని నేను మరచిపోలేను, మరచిపోను. అందుకే మీరు వయోజన విద్యాల యంలో చేరారని తెలియగానే మా స్నేహితులందరికీ ఈ విషయం చెప్పి మిఠాయి పంచిపెట్టాను. దేశంలో అనేకమంది ఆడవాళ్లు మహా నాయకులయినారు. అమ్మ, నా అత్త, నా పిన్ని, నా బామ్మ, నా మామ్మ అలా కావాలని నా కోరిక. అదేమంత సాధించలేని విషయం కాదు. కాకపోతే మొదట్లో కొస్త కష్టపడాలి. అసలు మీరు కష్టాల్లో పెరిగిన వారు. మీకు ఈ శ్రమ అంత కష్టంకాదు. నా అమ్మ అంత గొప్పది కావాలని కలలు కంటున్నాను. అందుకే నీకు ఇదంతా చెపు తున్నాను. మామూలుగా అయితే నేను మన ఊరు వచ్చి మీతో సరాసరి సూటిగా మాట్లాడేదాన్ని. ఇక్కడ నాకు సెలవు దొరకటం లేదు. పని వత్తిడి ఎక్కువ. అందువల్ల ఉత్తరం వ్రాస్తున్నాను.

మీ జీవితాలను మార్చుకుందామనే తాపత్రయం మీకు ఇంకా పుట్టలేదు. అలాంటి పనికి పూనుకుందామనే కోరిక మీకు కలుగలేదు. ఆ పని మొదలుపెట్టాలనే తహ తహ మీలో ప్రస్తుతంలేదు. మీలో జాగృతి రావాలని, మీలో చైతన్యం కనపడాలని నాకోరిక, నావాంఛ.

ఇపుడు జాగృతి అంటే ఏమిటో, చైతన్యం అంటే ఎలాంటిదో వాటికి జీవితానికి వున్న సంబంధం ఎలాంటిదో, హక్కులను గుర్తిం చడమే జాగృతి అని ఇప్పుడు మీరు తెలిసికొని ఉంటారు. వచ్చే ఉత్తరంలో హక్కులను గురించి వివరంగా వ్రాస్తాను.సెలవు. మీ

రాత్రి బడికి వచ్చే మహిళలందరికీ నా నమస్కారాలు అందచెయ్య అమ్మా! ఇక వుంటాను.

నీ కూతురు

స్వరాజ్యం

## హక్కుల చరిత్ర

అమ్మా!

నా ఉత్తరం రాత్రి బడిలో చదివానని వ్రాశావు. మీరంతా ఓపికగా నేను వ్రాసిన మాటలు విన్నందుకు నేను మీకు కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. పైగా ఉత్తరంలోని విషయాలను గురించి వివరంగా మాట్లాడుతున్నామని, తెలియని అంశాలను పంతులమ్మ తెలియజెప్పిందని వ్రాశావు. సంతోషం అదే నాకు కావలసింది. అదే నేను కోరేది. అదే నేను కాంక్షించేది.

ఈ వుత్తరంలో హక్కులనుగురించి వ్రాస్తున్నాను. హక్కులు ఒకరు ఇచ్చేవి, ఒకరు పుచ్చుకునేవి కావు. అవి ప్రతి మనిషికి మనిషిగా పుట్టినందువల్ల వచ్చేవి. మన చూట్టూ ఉన్న చెట్లు చేమలూ. వాగు, నదీ, సముద్రం, అడవీ, అరణ్యమూ, భూమి, ఆకాశం, నక్షత్రాలు, సూర్యుడు, చంద్రుడు, కాంతి, గాలి, శబ్దం, వీటినన్నింటిని కలిపి ప్రకృతి అంటాము. మరచిపోయాను, చేపలూ, పాములూ, తాబేళ్ళూ. జంతువులూ, కోతులూ, మనుష్యలూ అన్నికూడా ప్రకృతి భాగాలే. ప్రకృతిలో పుట్టినవే. కనుక మనకూ కొన్ని ప్రకృతి లక్షలక్షణాలు వస్తాయి. పుట్టడం, పెరగటం, చావడం జీవుల లక్షణం. ప్రాణం ఉన్న ఈ జీవులు తింటాయి, తమ సంతానాన్ని వృద్ధిచేసుకుంటాయి, నిద్రపోతాయి. ఇది మనందరం చూస్తున్న విషయం. గమనిస్తున్న అంశం. కొన్ని జీవులు అంటే పాములు, బల్లులు, పక్షులు లాంటివి గ్రుడ్లుపెట్టి, పొదిగి పిల్లలను కంటే, ఆవులు. బర్రెలు మేకలు గొర్రెలులాంటివి సరాసరి పిల్లల్ని కంటాయి. ఇలా సంతానాభివృద్ధి

చేసుకోవడాన్ని, తిండికోసం వెంపరలాడడాన్ని, నిద్రలోకి జారుకోవడాన్ని ప్రకృతి ధర్మాలంటాము.

ఈ ప్రకృతిలో పుట్టిన జీవులన్నిటిలో మనిషి చివరిగా పుట్టిన ప్రాణి. ఈ మనిషికి తతిమ్మా జంతుజాలానికన్న కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. మనిషికి మెదడు బాగా పరిణతి చెందింది. అందువల్ల ఆలోచనాశక్తి అధికం, జ్ఞాపకశక్తి మెండు.

అంతేకాదు తమ మనస్సులో మాటలను ఇతరులకు తెలియచెప్పగల జీవి. తన భాషను ముందుతరాల వారికి అందజేయు సత్తా సంపాదించుకున్నది మానవజాతి. తమ జీవితాలను సుఖంగా గడపటానికి అనువుగా పనిముట్లను, సాధనాలను తయారుచేసుకుంది ఈ జాతి. తన చేతితో చేసే పనులను తనకు మారుగా చేసేటందుకు యంత్రాలను, తమ మెదడుతో ఆలోచించి చేసే పనులను సాధించటానికి క్రొత్తరకం"మిషను"ను తయారుచేసింది మానవసముదాయం. మెదడు చేసే పనులు వేలు లక్షల సంఖ్యలో ఉంటాయి. వాటినన్నింటిని యంత్రం చేయలేకపోయినా చాల వాటిని చేయగల్గుతున్నది. ఉదాహరణకు మనం చంద్రుని వద్దకు విమానాలను నడిపాం. వాటిని భూమిమీద యంత్రాలు తమ ఉత్తర్వులద్వారా అదుపుచేస్తాయి. పైకి పో, క్రిందికి దిగు, కుడివైపు మళ్ళు, ఎడమవైపు మళ్ళు, ఇంకా వేగంగా వెళ్ళు, కాస్త నెమ్మదిగా పో ఇలాంటి ఆజ్ఞలను జారీ చేసేవి ఆ యంత్రాలు. కాలం మారుతున్నది. రోజురోజుకూ మనిషి శక్తి పెరుగుతున్నది. క్రొత్త ఆలోచనలు, క్రొత్తపథకాలు, కొత్త పనిముట్లు అమలులో పెట్టున్నది మనుష్యలోకం.

పై కథంతా ఎందుకు చెప్పానంటే మనుష్యులు ప్రకృతిలో పుట్టారు కనుక, ప్రకృతి లక్షణాలు వారికీ వచ్చాయని చెప్పటానికి. వారికీ జంతుధర్మాలు వచ్చాయి. ఆహారం, నిద్ర, జతకట్టడం ఇవి సహజమయినవిగా సంక్రమించాయి. ఎండ, వాన, వేడి, చలినుండి

రక్షణకోసం ఇళ్ళు, దుస్తులు అవసరమయ్యాయి. జననం, మరణం వ్యాధి ఏ జీవి తప్పించుకొనలేదు. కనుక వైద్యం తప్పనిసరిఅయింది. ఒక తరం నుండి మరొకతరం విషయాలను తెలుసుకుంటుంది కనుక పనిముట్ల వాడకాన్ని నేర్చుకుంటుంది కనుక, జీవిత విధానాలను ఎరుక పరుచుకుంటుంది కనుక అంటే ఒక్కమాటలో చెప్పాలంటే నాగరికతా సంస్కృతులను అందజేస్తుంది కనుక విద్య నేర్పడం అత్యవసరమయింది. కనుక విద్యకు ప్రాముఖ్యత వచ్చింది. మనిషికి భాష ఉన్నది, భావాలు వున్నాయి కనుక ఒకరి భావాలను మరొకరికి తెలియపర్చే పద్ధతి పెరిగింది. భావప్రకటన సాగింది. మొదట్లో నడిచిపొయ్యే మనిషి తర్వాత జంతువులను, రథాలను. ఇతర వాహనాలను, వాడటం సాగించటం సంభవించింది. నీటి శక్తితో, సూర్యకాంతితో, ఆవిరితో, నూనెతో, బొగ్గుతో, విద్యుచ్ఛక్తితో, చివరకు అణుశక్తితో నడిచే యంత్రాలను వాడుతూ మనిషి అంతరిక్షంలోకి కూడా ప్రయాణం చేస్తున్న కాలం ఇది. ఇతర గ్రహాలమీదికి పోయి తిరిగి రావాలని ప్రయత్నాలు సాగుతున్నాయి. పుట్టినది మొదలు చచ్చిపోయేవరకూ ఒకేచోట వుండటానికి మనుష్యులు ఇష్టపడంలేదు, సంచారం చేయాలనే కోరిక, అభిలాష పెరుగుతున్నది వారిలో. సరకులు కేవలం తమ వాడుక కోసమే కాకుండా ఇతరుల వినియోగం కోసం కూడా తయారు చేస్తున్నారు. దాంతో వ్యాపారం పెరుగుతున్నది. స్వంత ఆస్తి ఏర్పడింది. ఇలా మానవ జీవితం పరిణామం పొందుతున్నది అంటే మార్పు చెందుతున్నదన్నమాట.

హక్కుల ప్రస్తావన అంటే మాట బయటికి వచ్చింది. పుట్టుకతోనే ఏర్పాడేవి అంటే మనిషిగా పుట్టినందువల్లనే వచ్చేవాటిని ప్రకృతి సిద్ధమైన హక్కులు అంటారు. తిండి, బట్ట, ఆశ్రయం(ఇల్లు) విద్య, వైద్యం యివి ప్రాథమిక అవసరాలు. వీటిని అనుభవించడానికి

ప్రతి వ్యక్తికి హక్కుంది. అన్నిటికన్న ముఖ్యం ప్రాణం. ప్రత్యేక పరిస్థితుల్లో సమాజం ఏర్పరచుకున్న నియమాల ప్రకారం తప్ప ఏ మనిషి ప్రాణాన్ని యింకొకరు తీయరాదు; హరించరాదు. ఒకరిని మరొకరు చంపటానికి వీలులేదు. అంతేకాదు అపతలి వ్యక్తి దేహానికి ఘాతం కలుగజేయరాదు. అన్నిటికన్న మిన్న ఏ వ్యక్తి స్వేచ్ఛను తగ్గించరాదు. ఇక్కడ కొంత వివరంగా చెప్తాను. స్వేచ్ఛ అంటే సొంత కోరిక అన్నమాట. నా ఇష్టం అని ప్రక్కమనిషిని కొట్టరాదు చంపరాదు. మనం ఒంటరిగా బ్రతకడంలేదు. పదిమందిలో బ్రతుకుతున్నాం. దానిని సమాజం అంటాము. కుటుంబం అంటే మామ, అత్త, భర్త, భార్య, పిల్లలు, ఆడబిడ్డలు, మనుమలు, మనుమరాండ్రు ఇదంతా అన్నమాట. దీనిని సమిష్టి కుటుంబం అంటాము, అంటే కలిసి ఉండే పెద్దకుటుంబం; తండ్రి కుమారులు మనుమలతో కూడిన కుటుంబం. ఇందులో చిన్న కుటుంబాలు కూడా వుంటాయి. భర్త భార్య పిల్లలు మాత్రం కలిస్తే చిన్న కుటుంబం లేక అణుకుటుంబం అవుతుంది. ఇంతకూ చెప్పేదేమంటే పదిమందిలో బ్రతికే మనం ఇష్టం వచ్చినట్లు మరొకరిని బాధిస్తే, చంపితే వారూ మనలను అలాగే బాధిస్తారు; చంపుతారు. అప్పుడు అలజడి, అశాంతి తప్ప ఏమీ వుండదు. కనుక ఒకరి స్వేచ్ఛ మరొకరి స్వేచ్ఛకు అడ్డురాకూడదనే సూత్రం బయటికి వచ్చింది.

మనిషికి కొన్ని ముఖ్యమైనవి ప్రకృతిసిద్ధంగా హక్కులు వచ్చాయి. ఇలా మానవ సమాజం మనుగడ సాగిస్తుండగా సమాజంలో కొన్ని ఆచారాలు, సంప్రదాయాలు వచ్చాయి. ఇవి అవసరం దృష్ట్యా ప్రజల నమ్మకాన్ని పొందాయి. ఉదాహరణకు పొలాల విషయము తీసుకొండి. ఎగువ పొలానికి వెళ్ళడానికి దిగువ పొలంలో నుండి వెళ్ళవలసిందేకాని మరో మార్గం లేదుకదా! అందుకని ఎగువ

పొలంవారు తమ పశువులను, బళ్ళను దిగువ పొలంలోనుండి తమ పొలంలోకి నడుపుకొని వెళ్ళవచ్చు అనే నియమం పుట్టింది. అది ఆచారమయింది. అది సం(ప్రదాయమయింది. దానిని ఎవరూ కాదనటంలేదు. కాగా దిగువ పొలంలోని పైరుకు నష్టం కలుగచేయరాదు. కనుక పశువుల మూతులకు చిక్కాలు తగిలించాలి. బండి ఒక చక్రం గట్టుమీద మరో చక్రం పైరులో మొక్కల బారులమధ్య ఖాళీజాగాలో నడపాలనే పద్ధతి పుట్టింది. అది క్రమేపీ ఆచారమయింది. ఇలా ఆచార(ప్రకారం హక్కులు గట్టిపడ్డాయి. వాగునీరు, చెరువునీరు, కాలువనీరు పొలాలకు పెట్టుకునే విషయంలో కూడ రైతులు ఇలా కొన్ని ఆచారపు హక్కులు స్థిరీకరించుకున్నారు. ఇది హక్కుల చరిత్రలో రెండోదశగా పేర్కొనవచ్చును.

ఈ హక్కులకు భిన్నంగా మానవజాతి ప్రవర్తించసాగింది. బలవంతులయిన ఒక జాతివారు మరొక జాతివారిపై యుద్ధాలుచేసి వారిని ఓడించి, వారితో మగవారిని చంపి ఆడవారిని తమ దాసీలుగా ఉంపుడుగత్తెలుగా తీసుకొనిపెళ్ళిన రోజులున్నాయి. తరువాత కొంత కాలానికి మగవారిని చంపేదానికన్న వారిచేత పశువులలాగా చాకిరీ చేయించుకుంటే సౌకర్యమని తలంచి ఓడిపోయిన జాతికి చెందిన స్త్రీ పురుషులను బానిసలనుగా చేసుకున్న కాలం కూడా చరిత్రలో చోటుచేసుకున్నది. వారికి పిల్లలు పుడితే వారూ బానిసలే. మచ్చిక చేసిన పశువుల దూడలు యజమానికి చెందినట్లే బానిస దంపతుల సంతానం బానిసలే! మరికొంత కాలానికి పొలాల్లో వ్యవసాయం చేయించాలంటే కేవలం బలవంతం మీద చేయించడం కష్టమని బానిసలను విముక్తులను చేసి వారికి కొద్దిపాటి పొలాలను కవుళ్ళకు ఇచ్చి మక్తారేటు విపరీతంగా పెట్టి, వారిని ఎల్లపుడూ మక్తా బకాయి పడ్డే స్థితిలో ఉంచి వారు బాకీ చెల్లించనిది పొలం వదిలిపెట్టి వెళ్ళ

సీయని వ్యవస్థ, సామాజిక విధానం అమలులోకి వచ్చింది. దీనిని భూనిస వ్యవసాయ విధానం అంటాం. గ్రామాల్లో భూమి అంతా ఒక వ్యక్తికి చెంది ఆయనను రాజు, భూస్వామి, దొర, జమిందారు అనే పేర్లతో పిలిచేవారు ఆ కాలంలో. ఇంతలో పట్టణాలు పెరిగాయి. ప్రజల అవసరాలు పెరిగాయి. కమ్మరం, కుమ్మరం, వడ్రంగం, నేత భవన నిర్మాణం ఇలాంటి వృత్తులు బాగా పెరగాల్సి వచ్చింది. పట్టణాలలో వీటికి కార్ఖానాలు పెట్టారు. వీటిలో పనిచేయడానికి ప్రజలు కావలసి వచ్చారు. అయితే ఎక్కువమంది జనం గ్రామాలలో అర్ధబానిస విధానంలో ఇరుక్కొని పోయారు, వారు పట్టణానికి రావాలంటే భూస్వాములు రానీయటంలేదు. దాంతో పట్టణాలలో వారు ప్రజలకు సంచారపు హక్కు ఉందని ప్రచారం చేశారు. విప్లవాలు తెచ్చారు. సామాన్య ప్రజలూ పాల్గొన్నారు. భూస్వాముల నడ్డి విరిగింది. జనం బస్తీలకు ఎగబ్రాకి రైతులల్లా కూలీలయ్యారు. ఇప్పుడు మానవహక్కుల ప్రకటనలు వెలువడ్డాయి. ఇది హక్కుల చరిత్రలో మూడవదశ. దేశాన్ని ఇలా పరిపాలించాలని అలా రాజ్యం నడపాలని సూత్రాలు, నియమాలు, నిబంధనలు కట్టుడి చేశారు. వాటినన్నింటిని ఒక పుస్తకంలో వ్రాశారు. దానినే రాజ్యాంగం అన్నారు. రాజ్యాంగంలో పేర్కొన్న హక్కులను రాజ్యాంగ పరమైన హక్కులు, ప్రాథమిక హక్కులు, మౌలిక హక్కులు అని పిలవడం సాగింది. ఈ హక్కులకు భిన్నంగా ఏ శాసనాన్ని చేసినా చెల్లదని వ్రాశారు.

పైన చెప్పినదంతా మానవజాతి చరిత్ర స్థూలంగా అంతే ప్రపంచంలోని 162 దేశాలలో ప్రతి దేశంలోనూ ఇలాజరిగింది అని అనుకోకూడదు. దేశదేశానికి తేడాలు, మార్పులు ఉన్నాయి. నిజానికి మనదేశంలో భూమి అమరకం విధానం మరోరకంగా సాగింది. కొన్ని ప్రాంతాలలో భూమిమీద రాజుకు, భూస్వామికి హక్కులేదు. భూమి

అంతా ఆ గ్రామస్థులవి. అది వారి సమిష్టి ఆస్తి. కొన్ని ప్రాంతాలలో భూమి మొదట్లో అడవి నరికి సాగులోకి తెచ్చిన మనిషిది. అంతే రైతుదన్నమాట. కాగా రాజుకు పన్ను వసూలు చేసుకునే హక్కు మాత్రం ఉండేది. దానిని మేలువరం హక్కు అనేవారు. దానిని వారు ఇతరులకు దానం చేసేవారు. అలా ఈనాందారులు, అగ్రహారికులు పుట్టారు. ఇంగ్లీషువారు పెత్తనం చేసిన రోజుల్లో ఆ హక్కును తెల్లవారినుండి పొందిన జమీందార్లు వున్నారు. ఏదయినా అనేక ప్రాంతాల అనేక రకాల వ్యవసాయ సంబంధాలు ప్రజలమధ్య ఉండేవని తెలుస్తుంది. ఒకటిమాత్రం సత్యం. ఏ విధానం అమలులోఉన్నా శ్రమజీవుల హక్కులు చాల తక్కువస్థాయిలో వుండేవి.



భూమి మాత్రమే ఉత్పత్తి సాధనంగా ఉండే స్థితి మారింది. యంత్ర సాయంతో పరిశ్రమలు వచ్చాయి. మనుష్యుడు తన శారీరక శ్రమను తగ్గించుకుంటూ ఇంకొక పనిముట్టును వాడితే అదియంత్రమే. ఈ యంత్రాలను నెలకొల్పే తాహతు మొదట్లో పెద్ద కార్ఖానాలను పెట్టిన వారికి కలిగింది. వారివద్ద వేలమంది నేత పనివాను, కమ్మరులు, కుమ్మరులు, పనిచేసేవారు. యంత్రం అమలులోకి రాగానే వారు తమ కార్ఖానాలలో యంత్రాలను ప్రవేశపెట్టారు. యంత్రాల సాయంతో పనిచేసే వారి శ్రమ శక్తితో లాభంకోసం వస్తువుల ఉత్పత్తిని సాగించి అమ్మేవారు. వారినే పెట్టుబడిదారులంటాం, యంత్రం పెట్టుబడిదారుది. అక్కడ పనిచేసే కార్మికుడికి శ్రమశక్తి తప్ప మరేమీలేదు. శ్రమశక్తిని బజారు ధరకు పెట్టుబడిదారుకు అమ్మి అతడు కూలీ తీసుకుంటాడు. ఈ దశలో పెట్టుబడిదారూ ఒక వ్యక్తి కార్మికుడూ ఒక వ్యక్తి అని, ఇద్దరూ సమానులు అనే వాదన బయటికి వచ్చింది. వారిద్దరూ కలిసి కూలీ రేటు విషయమయి ఒప్పందానికి

వస్తారు. అంటే స్వేచ్ఛతో ఇద్దరూ చేసుకునే ఒడంబడిక లేక కంట్రాక్టు అనే మాటలు వినవచ్చాయి. వినడానికి సొంపుగానే ఉంది కాని ఇది వాస్తవానికి నిలవదు. "నీవు చెప్పిన తక్కువ రేటుకు నేను పని చేయను" అని భీష్మించుకుంటే ఫ్యాక్టరీ మూసేస్తాడు పెట్టుబడి దారుడు. దాంతో కూలీ పోతుంది కార్మికులకి. వీరు ఎక్కువకాలం ఆకలిబాధకు తట్టుకోలేరు. అలా కార్మికులను లొంగదీసుకుంటాడు పెట్టుబడిదారు. పైకి "నీవు నేను సమానమే" అంటాడు. కాగా తన వద్ద డబ్బు పేరుకొని ఉన్నదని అతనికి తెలుసు. కాని బిర్ర బిగిసి కూర్చుంటాడు. ఈ దశలో పైకి తను చెప్పే సమానత్వసిద్ధాంతాన్ని అమలులో జరిగినట్లు కన్పించాలని వయోజనులందరికీ వోటుహక్కు తనకు ఇష్టం లేకున్నా, గతిలేక, ప్రకటించడానికి పెట్టుబడిదారులు అంగీకరించక తప్పలేదు. ఈ దశలో పౌరులకు మానవహక్కులు లేక ప్రజాస్వామిక హక్కులు వచ్చాయి. వోటు హక్కు, వోటు వేసే హక్కు, ప్రజా ప్రతినిధిగా పోటీచేసే హక్కు, రాజ్య పరిపాలనను రాజులద్వారా, జమీందారులద్వారా, పెట్టుబడిదారులద్వారా, పరిపాలించుకునే హక్కు ఇలాంటివి వచ్చాయి. చివరకు రాజులేని రాజ్యాలు రిపబ్లిక్కులు-స్థాపించుకునే హక్కుకూడా పొందారు ప్రజ. ఇది హక్కుల చరిత్రలో నాలుగవ దశ. ఇప్పటికి హక్కులను అమలు పరచడానికి రాజ్యాంగంలో వెసులుబాటు కల్గించారు, కోర్టులకు అధికారాలు ఇచ్చారు. అమలు పరచటానికి వీలైనహక్కులను పేర్కొని మౌలిక హక్కులన్నారు రాజ్యాంగంలో. అట్లా అమలుచేయ తలచని హక్కులను కేవలం మార్గదర్శక సూత్రాలలో పొందుపరిచారు రాజ్యాంగంలో ఒక భాగంలో. మనదేశంలో ఇలా జరిగింది.

పెట్టుబడిదారి విధానంమీద, ప్రజల హక్కులను పేర్కొని అదే సమయంలో ఆస్తివంతుల ఆస్తిని, అధికారాన్ని గట్టిగా కదిలించని రాజ్యాంగాలమీద తిరుగుబాట్లు వచ్చాయి. అవి రెండు రకా

లుగా వచ్చాయి, ఒక పద్ధతి ప్రకారం ప్రజలు, మూకలు, గుంపు కనుక వారికి రాజ్యాధికారం కల్పించడం అనుచితమని చెపుతూ దేశం పేర, జాతి పేర కొద్దిమంది పెత్తనం చేయడం జరిగింది. అది ఫాసిజం. నాజిజం అనే పేర్లతో ఇటలీ, జర్మనీలలో తల ఎత్తింది. పౌరుల హక్కులను తీసివేసేశారు. ప్రజల మానప్రాణాలకు, మనుగడకు ప్రమాదం ఏర్పడింది. ప్రపంచ యుద్ధాన్ని తెచ్చింది ఈ విధానం. ద్వితీయ ప్రపంచ సంగ్రామము 1939 నుండి 1945 వరకు మారణహోమంతో సాగింది. కోట్లమంది ప్రాణాలు కోల్పోయారు. కోట్లమంది వికలాంగులయ్యారు. అనేక దేశాల సంపద బూడిద పాలయ్యింది. ఇది హక్కుల చరిత్రలో అయిదవ దశ.

పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా తిరుగుబాట్లు విప్లవాలు. వచ్చాయి. మొదట్లో రష్యాలో విప్లవం విజయవంతమయింది 1917లో దీనిలో కార్మికులు. రైతులు. మధ్యతరగతి ప్రజానీకం విశేషంగా పాల్గొన్నారు. తిండి, శాంతి, భూమి అనే నినాదాలతో ప్రజలు సమిష్టిగా పోరాడేరు. లక్షలమంది కార్మికులు పాల్గొన్నారు. ప్రాణాలొడ్డి పోరాడి అధికారాన్ని కైవసం చేసుకున్నారు. ఈ విప్లవం కష్టజీవుల పేరుమీద జరిగింది. పరిశ్రమలను భూములను, గనులను, వ్యాపారాన్ని ప్రభుత్వంస్వాధీనంచేసుకున్నది. కొంతకాలానికికార్మికసంఘాల పెత్తనంతగ్గింది. వాటిపై పెత్తనంవహించే అధికార రాజకీయపార్టీలోకి పూర్తి పెత్తనం పోయింది. ప్రభుత్వ ఆదేశాలను ధిక్కరించే వారిపై శిక్షలు మొదలయ్యాయి. ప్రజల ఆర్థిక జీవన ప్రమాణం పెరిగింది. కాగా వారి అభిప్రాయ ప్రకటనపై ఆంక్షలు వచ్చాయి. ఇదంతా స్టాలిను హయాంలో జరిగింది. రాజ్యాంగంలో పౌరుల హక్కులు స్పష్టంగా ఉదారంగా పేర్కొనబడినా ఆచరణలో అవి లేకుండా పోయాయి. ఇలాంటి పెత్తందారీతనం అవసరమని వాదించేవారు, అది అక్రమమనేవారు ఇరువర్గాలుగా ఇప్పటికీ వున్నారు. ఇది మానవ

హక్కుల చరిత్రలో ఆరవదశ.

రష్యాలో స్టాలిను పద్ధతులపై వ్యతిరేకత 1952లో ప్రారంభమయింది. 1987లో గట్టిరూపం తాల్చింది. పౌరుల హక్కుల శాసనబద్ధ రక్షణ తిరిగి వచ్చింది. పౌరుల ప్రజాస్వామ్య హక్కుల విస్తరణ జరుగుతున్నది. సమాజాన్ని మరల నిర్మాణం చేయాలని, కార్యకలాపాలు చర్చలు బహిరంగంగా సాగాలని సిద్ధాంతాలను రూపొందించి ఈనాటి రష్యా అధినేత గోర్బచెవ్ ప్రకటించి అమలుపరుస్తున్నాడు. ఇలాంటి ధోరణిలో కమ్యూనిస్టు ప్రపంచంలోని ఇతర దేశాలలో జరుగుతున్నది. ఇది మానవ హక్కుల చరిత్రలో ఏడవదశ.

ఇలా హక్కుల చరిత్ర అనేక దశలను దాటింది. దాటు తున్నది.

అమ్మా! పైన చెప్పినదంతా దరహంమీద అంటే మొత్తం మీద చెప్పే మాటలు. దేశదేశానికి, ప్రాంత ప్రాంతానికి తేడాలు, వ్యత్యాసాలు ఉంటాయి. మనుషులంతా మూసపోసినట్లు ఒకటిగా ఉండరు కదా! అలాగే దేశ చరిత్రలు కూడాను.

మీ అమ్మాయి
స్వరాజ్యం

## హక్కులు - బాధ్యతలు

అమ్మా !

నా రెండో ఉత్తరం మిమ్మల్ని అందరినీ విసిగించిందా ? ప్రపంచ చరిత్రలో హక్కుల అధ్యాయాన్ని అంత కుదించి వ్రాయ

టంతో మీకు చదవడం కష్టమయిందేమోనని భయపడ్డాను. కాని నీ జవాబు వచ్చిన తరువాత ఊరట చెందాను. మీరు అందరూ చాల లోతుగా ఆలోచించగల సమర్థత ఉన్నవాళ్ళు. కాకపోతే అనేక విషయాలు మీకు క్రొత్త కావడంతో నా మనస్సులో భయ సందేహాలు చోటుచేసుకున్నాయి. ఏదయినా నేను అనుకొన్నంత శ్రమ మీకు కలుగనందుకు ఆనందంగా ఉంది. ఈ ఉత్తరంలో హక్కులకు బాధ్యతలకు ఉన్న సంబంధం గురించి వ్రాస్తాను.

ఇప్పటికి హక్కులను గురించి మనకు కొంత అవగాహన వచ్చింది కదా! బాధ్యతల విషయం ఆలోచిద్దాం. మనం పుట్టినప్పటి నుంచి వేల సంవత్సరాలనుండి మనకు బాధ్యతలను గురించి చెప్పారు. తల్లి దేవత, తండ్రి దేవుడు, గురువు దేవుడు వీరిని పూజించాలి. భర్తను దేవునిగా తలంచి భార్య ఆరాధించాలి. తల్లిదండ్రులు తమ పిల్లలను వాత్సల్యంతో పెంచాలి. భర్త భార్యను అనురాగంతో ఆదరించాలి. గురువు శిష్యుని తన కుమారునివలె పరిగణించాలి, శిష్యునకు గురువు వినా, విద్యార్థి దశలో, మరో దైవము లేడు. కోడలు అత్త ఆజ్ఞలను, ఆదేశాలను పాటించాలి. కుమారుడు రామునివలె పితృవాక్యపరిపాలకుడుగా భాసిల్లాలి. రాజువిష్ణుమూర్తితో సమానుడు. ఇవన్నీ విధులు. గృహస్థు అతిథి అభ్యాగతులను ఆదరించాలి, ఇలాంటివి ఎన్నో, ఇంకెన్నో. హక్కులవిషయమయిన ప్రస్తావన అమెరికను విప్లవకాలంలో 18వ శతాబ్దంలో వచ్చింది. మానవహక్కుల ప్రకటనలు వెలువడినాయి. అమెరికను రాజ్యాంగంలో పౌరుల హక్కుల అధ్యాయం వెలసింది. 1936లో రష్యా రాజ్యాంగంలో పౌరహక్కులను పేర్కొనడం జరిగింది. 1950లో భారత రాజ్యాంగంలో పౌరుల మౌలిక హక్కుల అధ్యాయాన్ని పొందుపరిచారు. ఇలా హక్కులకు రాజ్యాంగపరమయిన హోదా, రక్షణ కలిగింది.

బాధ్యతలను వద్దని ఎవరమూ అనము. అసలు మనము బాధ్యతలలోనే పుడతాము, పెరుగుతాము. వాటిని తప్పించుకుని పోలేము. తల్లులుగా మీకందరికీ తెలును. కన్నపిల్లలను పెంచే బాధ్యతనుండి తల్లిదండ్రులు తప్పించుకోగలరా? అలాగే తతిమ్మావి. మన రూపాయి నాణెము తీసుకోండి. దానికి బొమ్మా బొరుసూ వుంటాయి కదా॥ అలాగే హక్కులూ బాధ్యతలూ బొమ్మా బొరుసూలాంటివి. బాధ్యత స్వీకరించదలచని వారికి హక్కులుండవు. హక్కులు కోరేవారు బాధ్యతలను నెరవేర్చాలి. అంటే వాటిలో ఒకటి కావాలంటే రెండవది వెంటనే వస్తుంది. అందులో అనుమానం లేదు. అయితే ఇన్ని వేల సంవత్సరాలనుండి బాధ్యతలను గురించి మాత్రమే మన సమాజాన్ని నడిపించిన పెద్దలు మాట్లాడుతూ వచ్చారు. ఉదాహరణకు స్త్రీల బాధ్యతలు, కుమారుని బాధ్యతలు, మనుమని బాధ్యతలు ఇలా చెప్పారు. కాని స్త్రీల హక్కులు, చిన్నపిల్లల హక్కులు, సంతానం యొక్క హక్కులు వీటిని గురించి పెద్దగా ప్రస్తావించలేదు. అందువల్ల పైన పేర్కొన్న హక్కులను గురించి ప్రజలు పట్టించుకోవడం మానివేశారు. దాంతో హక్కులను గురించి ప్రకటనలు, వాటిని అమలుచేయడం మరుగున పడిపోయింది.

మొదట్లో చెప్పుకున్నాం. ఒకరి స్వేచ్ఛ మరొకరి స్వేచ్ఛకు అడ్డురాకూడదని. ఈ సూత్రం నుండే హక్కులూ, బాధ్యతలూ రెండూ పుడుతున్నాయి. ఒకదానిని తీసుకొని రెండవదానిని కాదనడం సరియైన పద్ధతికాదు. వ్యక్తి సమాజంలో జీవిస్తున్నాడు. వ్యక్తుల కలయికే సమాజం. సమాజం లేకుండా వ్యక్తికి సరిఅయిన జీవితం ఉండదు. కుటుంబం కూడా ఒక చిన్నసైజు సమాజం అని చెప్పుకున్నాం కదా! వివాహం చేసుకొనని పురుషుడికిగాని, స్త్రీకిగాని

తల్లిదండ్రులతో సంబంధం, అన్నదమ్ములతో, అక్కచెల్లెళ్ళతో సంబంధాలు విడిపోవటం లేదు కదా! కాకపోతే మరోమనిషి భార్య అనండి, భర్త అనండి కుటుంబంలోకి రావటం లేదు. ఒక మాట మాత్రం స్పష్టం, ఏ మనిషి సమాజాన్ని తప్పించుకోలేడు కాకపోతే ఒక సమాజాన్ని వదలి మరో సమాజంలో చేర్తాడు అంతే. సమాజం అతన్ని వదలదు. కుటుంబాన్ని వదలి ఒక పురుషుడు గోసాయీలలో చేరాడనుకోండి. అతడు కుటుంబమనే చిన్న సమాజాన్ని వదలి గోసాయీలనే మరోసమాజంలో చేరాడన్నమాట. ఒకస్త్రీ కుటుంబాన్ని వదలి ఒక భక్తుల మఠంలో చేరిందనుకోండి అంటే కుటుంబం అనే సమాజపు కూటమిని వదలి మఠం అనే మరొక ప్రజల కూటమిలోకి ఆమె వెళ్ళిందని అర్థం. ఒక మాట అర్థం చేసుకోవాలి. ప్రకృతి ఒడిలో మనం అందరమూ పెరుగుతున్నామని అనుకున్నాంకదా! వాటిలో ఉన్నతజాతి జంతువులను గమనించండి. అడవిలో కూడా తేళ్ళు, జింకలు, ఏనుగులు, కోతులు మందలుగా తిరుగుతుంటాయి. మందజీవితం సహజం. అలాగే మనిషి కూడాను. కాకపోతే మందలో ఉంటూ ఉన్నా ఏ మనిషికి ఆ మనిషి ప్రత్యేకమైన వ్యక్తి. అతనికి లేక ఆమెకు అలాయిదాగా కొన్ని లక్షణాలు ఉంటాయి. ఆకారంలో, నడకలో, మాట్లాడే తీరులో, ఆలోచించే విధానంలో, భావాలలో, అభిప్రాయాలలో విశిష్టత కనిపిస్తుంది.

మనిషికి మనిషిగా ఒక హుందాతనం ఏర్పడింది. నేను మనిషిని, నాకు మెదడు వుంది, నేను ఆలోచించగలను, నేను తెలుసుకోగలను, నేను జ్ఞాపకం పెట్టుకోగలను, నేను ఊహించగలను, నేను క్రొత్త వస్తువును సృష్టి చేయగలను, నేను తోటి మనిషికి సాయం చేయగలను అని మనిషి అనుకోవటం, భావించటం గమనిస్తున్నాం. దీనిని ఆత్మవిశ్వాసం అంటాం. అంటే తన శక్తి మీద, తన తాహతు

మీద తనకు నమ్మకం అన్నమాట. ఎప్పుడయితే ప్రతి మనిషికి ఆత్మ విశ్వాసం అవసరమవుతుందో అప్పుడు తప్పనిసరి కాదని పిల్లలకు హక్కులేమిటని కొందరు విస్తుపోతారు పిల్లలలో సత్యాన్ని తెలుసు కోవాలనే కుతూహలం ఎక్కువగా ఉంటుంది. ప్రతిదానికీ ఇదెందుకు అది ఎలా అని ప్రశ్నలు అడుగుతుంటారు. సమాధానాలు చెప్పే వారికి ఓపిక ఉండాలికాని వారు వేసే ప్రశ్నలకు అంతు వుండదు. ఆకాశం ఎందుకు నీలంగా ఉంది. ఎండ ఎందుకు ఎక్కువగా ఉంది. సముద్రంలో నీరు ఎవరు పోశారు, వెన్నెల్లో ఎందుకు చల్లగా ఉం టుంది? నీళ్లు ఎందుకు తాగాలి ఏవో ఒకదానికి మరొకదానికి సంబం ధంలేని ప్రశ్నలు సవాలక్ష అడుగుతారు. అంటే వారిలో సత్యాన్వే షణా సక్తి ఉన్నదన్నమాట. వాస్తవాన్ని తెలుసు కుందామనే తహ తహ వారి ఈడులో ఎక్కువగా ఉంటుంది. వారి ఈ లక్షణాన్ని చిదిమివేయరాదు. తీరికగా, ఓపికగా తమకు తెలిసినంతవరకు పెద వాళ్ళు చిన్న పిల్లలకు చెప్పాలి. "వెధవల్లారా నోరు మూసుకోండి, విసిగిస్తున్నారు. పోండి ఎక్కడికయినా" అని తిట్టి కొట్టకూడదు. అలాగే ఏవో క్రొత్త వాటిని తయారుచేస్తారు. పిచ్చిక గూళ్ళు కడతారు రైలులాగే తిరుగుతారు. ఒకరు ఇంజను తతిమ్మావారు పెట్టెలు. అది రైలు ఆట క్రొత్తదానిని తెలిసికోవాలని, అది ఎలా ఉంటుందో చూడాలని, తయారుచేయాలని వారు ఏచర్యనయినా మొదలుచేస్తారు. క్రొత్త దానిని తయారుచేయాలనుకోవడాన్ని సృజనాభిలాష అంటారు అంటే సృష్టి చేయాలన్న కోరిక అన్న మాట. ఇలా చిన్న పిల్లలకు సహజంగా ఉంటే ఊహాపోహలను అణచివేయరాదు. అందుకే వారికి క్రొత్త విషయాలను తెలుసుకునే హక్కు, క్రొత్తవాటిని తయారుచేయ డానికి హక్కు ఉన్నాయంటాము. చిన్నపిల్లలకు పెద్ద వాళ్ళ కన్నా ఎక్కువ నిద్ర అవసరం, అది వయస్సును బట్టి ఉంటుంది. కనుక వారి చేత పెద్దవాళ్ళలాగా పనిచేయించరాదు. వారి చేత బండ చాకిరీ

చేయించరాదు. వారికి విశ్రాంతి అవసరం అదివారి హక్కు. అంతే కాదు. వాళ్ళ వయసులో పిల్లలు చదువుకోవాలి, నేర్చుకోవాలి. వారి దృష్టి దానిపై కేంద్రీకరించాలి. అంటే వారిని చదువుకోనివ్వాలి. పిల్లలు ఆ ఈడులో ఆడుకోవాలనుకుంటారు, ఈ ఆటలద్వారా వారిలో కలుపుగోలు తనం, అందరం సమానమనే భావం, అందరం కలసి కట్టుగా ఉండాలనే ఊహ ఇవన్నీ ఏర్పడతాయి. కనుక వారు ఆటలు ఆడుకుంటుంటే విసుక్కోరాదు. వారికి ఎంతసేపూ ఇంటి పనులు చెప్పి వారిని జైలులోని ఖైదీలలాగా చూడరాదు. అంటే పిల్లలకు ఆడుకునే హక్కు ఉంది. ఇలా పిల్లలకు అనేక రకాల హక్కులను రూపొందించాము. ఈ హక్కులన్నింటిని కలిపి ఒకచోట చేర్చి పిల్లల హక్కులు అనిపేరు పెట్టాం.

ఇదంతా చదువుతుంటే స్త్రీలకు ప్రత్యేకంగా హక్కులున్నాయా అని మీకు అనుమానం వస్తున్నదికదూ! స్త్రీలకు ప్రత్యేకంగా హక్కులు ఉన్నాయి. ఉండాలి కూడాను. మీలో కొందరికి వెంటనే సమానత్వం మీద పాఠం గుర్తుకు వచ్చి ఉంటుంది. స్త్రీలు పురుషులు సమానమయితే స్త్రీలకు ప్రత్యేకంగా హక్కులు ఎందుకు? ఇదీ అనుమానం. అంతేకదా? అలాంటి ప్రశ్న క్రొత్తగా విషయాలు తెలిసికునే రోజుల్లో పుట్టడం సహజమే. అందుకని అలాంటి ప్రశ్నలకు సమాధానం చెప్పుకుందాం.

తొమ్మిది నెలలు కడుపులో మోసి పిల్లను కనేది తల్లేకదా! తండ్రికన్న తల్లి స్థానం అందుకే గొప్పదని పెద్దలుచెప్పటం జరిగింది అంతేకాదు. సుమారు 7 నుండి 12 నెలలదాకా పిల్లకు చనుపాలిచ్చి పోషించేది తల్లేకదా! కనుక ఆ సమయంలో, ఆ పనులుచేసేటప్పుడు ఆమెకు అధికంగా, మరింత ఎక్కువగా, రక్షణ, పోషణకావాలన్నారు పెద్దలు. ఆమె గర్భిణీగా ఉన్నపుడు ఆమెచేత బరువు పనులు చెయ్యనీయ వద్దంటారు. అలాచేస్తే కడుపులో ఉన్నపిల్లకు దెబ్బ,

అదీగాక ఆమె ఇరువురిని పోషించాలి. తనను పోషించాలి. తన గర్భంలో ఉన్న పిల్లకు ఆహారం, బలం అందజేయాలి కనుక ఆమెకు బలమైన ఆహారం ఆ కాలంలో ఎక్కువగా పెట్టాలి. ఇది మనందరికీ తెలిసిన విషయమే. అంతేకాదు మనశ్శాంతి అవసరం. ఆమె ఏవిధమైన ఆందోళనకు, ఉద్రేకానికి లోను కాకుండా ఉండాలి. కాని ప్రస్తుత సమాజంలో పనిచేయకుండా ఎవరికీ తప్పటం లేదే? స్త్రీలు కూడా ఎన్నో వేల సంవత్సరాలనుండి పొలాలలో, చేతివృత్తులలో పనులు చేస్తూనే ఉన్నారుకదా! రెండు మూడు వందల సంవత్సరాల నుండి ఫ్యాక్టరీలలో కార్మికులుగా ఉంటున్నారు. అరువది సంవత్సరాలనుండి ఆఫీసులలో కూడా స్త్రీలు ఉద్యోగాలు చేయటం మనం చూస్తున్నాం. మరి వారికి విశ్రాంతి ఎక్కడ? తీరిక ఎక్కడ. అందుచేత గర్భిణీస్త్రీలకు జీతంమీద 6 వారాలు సెలవు ఇస్తున్నారు మనదేశంలో. అది ప్రసవానికి ముందుకొంత, తరువాత కొంత తీసుకోవచ్చును. స్వీడను లాంటిదేశంలో 3 నెలలు అంటే 12 వారాలు సెలవు ఇస్తారు. పిల్లను కన్నతరువాత జీతంమీద మరో ఆరు నెలలు సెలవుఇస్తారు. ఇదంతా జీతం ఇచ్చి సుమండీ. పిల్లను పెంచటానికి తల్లికి, తండ్రికి ఇద్దరికీ కలిపి 12 నెలలు అంటే ఒక సంవత్సరం పూర్తి జీతం మీద సెలవు ఇస్తారు. ఇలా చేయటం న్యాయం. ఎందుకో నేను స్త్రీని కనుక, మీరంతా స్త్రీలు కనుక నేను అలా అనటం లేదు. మన స్త్రీలం మానవజాతిని కొనసాగించటానికి తోడ్పడుతున్నాం. మనం కని పెంచకపోతే మనుష్యులు ఇక ముందు పుట్టరు, పెరగరు. ఇది జాతి మొత్తానికి మనం చేసే సేవ. అందువల్లనే సమాజం మనలను ప్రత్యేకంగా శ్రద్ధగా చూడాలి. గర్భిణీతో ఉన్నపుడు, పిల్లకు పాలిచ్చే రోజుల్లో స్త్రీకి బలమైన ఆహారం కావాలన్నాం కదా! అందుకని పాలు, పండ్లు, విటమిన్లు, టానిక్కులు ఆమెకు అందుబాటులోకి

రావాలి. వాటిని ఆమెకు ఉచితంగా సమాజం అందించాలి. ఇది ఆమె హక్కు. ఇలా స్త్రీలకు ప్రత్యేకమయిన హక్కులు అవసరమవుతున్నాయి. వీటిని గురించి తరువాత వ్రాస్తే ఉత్తరంలో ఇంకా వివరంగా వ్రాస్తాను.

సెలవు అందరికీ నా వందనాలు అందచెయ్యి.

నీ కుమార్తె

స్వరాజ్యం.

## స్త్రీల హక్కులు

స్త్రీ పురుషులు కాస్త శరీర నిర్మాణంలో తప్ప ఇతరత్రా సమానులని సమానత్వ పాఠంలో తెలిసికొన్నాం. కనుక వారిద్దరికి సమానమయిన హక్కులుండాలి అని ప్రకటించడంలో పొరపాటు లేదు. మన దేశపు రాజ్యాంగం అలాగే స్పష్టంగా చెప్పింది.

స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం ప్రతి పౌరుని హక్కులు. సామాజిక న్యాయంకోరే హక్కు ప్రతి వ్యక్తికీ వుంది. ఈ హక్కులను 1948లో డిసెంబరు 10వ తేదీన మానవహక్కుల "కమీషను"వారు రూపొందించారు ఒక ప్రకటనలో. దానిని విశ్వ మానవహక్కుల ప్రకటన అని పిలుస్తారు. దాంట్లో ఆర్థిక సంబంధమయిన, రాజకీయ సంబంధమయిన, శారీరక భద్రతకు సంబంధించిన సామాజిక స్వభావం కలిగిన, కుటుంబపరమయిన అనేక హక్కులను పొందుపరిచారు. అయితే ఐక్యరాజ్యసమితి— అన్నిదేశాలవారు 1945లో ఏర్పరచుకున్న సంఘం...దీనిని ప్రకటించినా ఏ దేశం ఎంతవరకు వాటిని అంగీకరిస్తే అంతవరకే అవి ఆ దేశంలో చలామణీ అవుతాయి. అంటే ఆ కమిషను వారు తయారుచేసిన ఆర్థిక హక్కులను ఒకదేశం ఆమోదించలేదనుకోండి, ఆ దేశంలో ప్రజలు

ఆ హక్కును అమలుపరచమని అడిగే హక్కు లేదు. ఉదాహరణకు ప్రతి వ్యక్తికీ పని పొందటానికి హక్కు ఉందని వ్రాశారు ఆ ప్రక టనలో. మన దేశ రాజ్యాంగంలో అలా వ్రాయలేదు. మన దేశ ప్రభుత్వం ప్రపంచానికంతటికీ కావలసిందిగా వ్రాసిన ఆ హక్కును అంగీకంచి మన దేశరాజ్యాంగంలో ఇమడ్చకపోతే మనం ఆ హక్కును అమలుపరచమని కోరటానికి వీలులేదు. అంటే, "నేను పనిచేస్తాను. నాకుపని ఇప్పించండి" అని ప్రభుత్వాన్ని కోరితే ప్రభు త్వం ఉద్యోగం ఇవ్వకపోతే, ఉపాధి కల్పించకపోతే న్యాయ స్థానంలో దావావేసి పని కల్పించమని ప్రభుత్వానికి ఉత్తరువు ఇప్పించటానికి వీలుపడదు. ఇలాంటి హక్కులు ఎన్నో ఉన్నాయి. మర్రో ఉదాహరణ ఏదేశంలోని స్త్రీ అయినా, పురుషుడు అయినా మరోదేశంలో పురుషుని, స్త్రీని స్వేచ్ఛగా ఇద్దరి ఇష్టం మీదపెళ్ళి చేసు కోవచ్చు. అనే సూత్రం అందులో ఉంది. అంతేగాక వారిద్దరు కలసి కుటుంబంగా ఏర్పడి వారికిష్టమైన చోట కాపురం ఉండవచ్చును. అనివ్రాసిఉంది. అంతే, రెండో ప్రపంచ యుద్ధకాలంలో రష్యాలో ఆనాడు ఉన్న కొందరుబ్రిటీషు పురుషులు రష్యను స్త్రీలను పెళ్ళి చేసుకున్నారు వారుబ్రిటనులో కాపురం పెట్టుకుంటామన్నారు. ఆనాటి రష్యను ప్రభుత్వం అంగీకరించలేదు, అనుమతించలేదు. ఈనాటి ప్రభుత్వం అయితే అంగీకరించి ఉండేది.

ఇలా ఎన్నో హక్కులు విశ్వమానవ హక్కుల జాబితాలో ఉన్నా మనకు అందుబాటులో లేకుండా పోయినాయి. ఇందులో మాత్రం స్త్రీ పురుష వ్యత్యాసం లేనే లేదు.

ఇకపోతే పురుషులు, స్త్రీలు సమానంగా అనుభవించేహక్కులు కొన్ని ఉన్నాయి. వాటిని అన్నింటిని ఇక్కడ వివరించటం సాధ్యం

కాదు. కొన్నింటిని మాత్రం పేర్కొంటాను. ఇదంతా మన రాజ్యాంగంలో వ్రాశారు.

ప్రతి పౌరుడికి భావప్రకటనా స్వేచ్ఛ ఉంది. తన అభిప్రాయాలు చెప్పవచ్చు. సమావేశాలలో వాటిని గురించి మాట్లాడవచ్చు. పదిమంది కూర్చుని మాట్లాడుకోవటానికి లేక వందలు వేల మంది కలసి వినడానికి, ప్రసంగించడానికి సభలను ఏర్పాటు చేసుకోవచ్చు. దీనిని సభాస్వాతంత్ర్యం అంటారు. అనేకమంది కలసి తమకు ఇష్టము వచ్చిన కార్య కలాపాలను సాగించడానికి సంఘాలను నిర్మించుకోవచ్చు. దీనిని సంఘ స్వాతంత్ర్యం అనిపిలుస్తాము. అలాగే దేశంలో ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి పోవటానికి ప్రతి మనిషికి హక్కు కలదు. దీనిని సంచార స్వాతంత్ర్యం అంటారు. ప్రతి వ్యక్తి తనకు నచ్చిన వ్యాపారాన్ని ఉద్యోగాన్ని చేసుకోవచ్చును. దీనిని వ్యాపార స్వాతంత్ర్యం అంటారు. అయితే వీటన్నింటికి కొన్ని పరిమితులు ఉన్నాయి. ఏ నిబంధనా లేకుండా వీటిని వాడుకోవటానికి వీలు లేదు. దేశ భద్రతకు, ప్రజాశాంతికి, సభ్యతకూ నీతికి అవసరమైన పరిమితులను పేర్కొంటూ శాసనాలు చేయవచ్చును. వాటికి లోబడి మాత్రమే వీటిని ప్రజలు అనుభవించగలరు. రంగు, వర్ణం, కులం, జాతి, మతం, భాష, ప్రాంతం, రాజకీయాది అభిప్రాయాలు వీటితో నిమిత్తం లేకుండా స్త్రీ పురుషులందరూ సమానులు అని పేర్కొనబడింది. అయితే బలహీన వర్గాలు. స్త్రీలు, పిల్లలు వీరికి అదనంగా సౌకర్యాలు, సదుపాయాలు చేస్తే తప్పులేదన్నారు. రంగు, వర్ణం, కులం, జాతి, మతం, భాష, ప్రాంతం, రాజకీయాది అభిప్రాయాలు వీటితో నిమిత్తం లేకుండా ఉద్యోగ నియామక విషయంలో స్త్రీ పురుషులు సమానులు అన్నారు. అయితే షెడ్యూలు జాతులు, వెనుకబడిన జాతులు వీరికి అధికంగా వెసులుబాటు కలిగించ వచ్చని

ప్రకటించారు. అలాగే ప్రాంతీయ భేదాలను బట్టి రాష్ట్రాలవారీగా ఉద్యోగ సందర్భంగా కొన్ని నియమాలు ఏర్పరచవచ్చని అన్నారు.

అంటరాని తనాన్ని రద్దు చేశారు. తరువాత అంటరాని తనాన్ని నేరంగా ప్రకటిస్తు శాసనం వచ్చింది. ఏ వ్యక్తి అయినా తనకు ఇష్టం వచ్చిన మతాభిప్రాయం కలిగి ఉండవచ్చును. ఆ అభిప్రాయాన్ని ఇతరులలో ప్రచారం చేయవచ్చును. తాను ఆ మతాన్ని అనుసరించవచ్చును. కాగా మత సంస్థ చేసే కార్యక్రమాలలో లౌకిక పరమైన వాటి విషయంగా ప్రభుత్వం అదుపు చేయవచ్చును. అయితే ప్రజారోగ్యం, ప్రజాశ్రేయస్సు. ప్రజాశాంతి, నీతి,సభ్యతలను దృష్టిలో ఉంచుకొని మాత్రమే అలా చేయాలి.

ప్రభుత్వం చేత నడపబడే సంస్థలలో మత బోధ జరుపరాదు కాగా ప్రభుత్వం యొక్క ధన సహాయం లేక ఇతరత్రా సహాయం పొందే సంస్థలలో మత బోధ జరుగవచ్చును. కాని వద్దన్న విద్యార్థిని బలవంతం చేయరాదు. మత సంస్థలు విద్యాలయాలు పెట్టవచ్చును. కేవలం మత సంస్థ అయినంత మాత్రాన ప్రభుత్వం సహాయాన్ని నిరాకరించరాదు.

ఒక మనిషి ఒక నేరం చేశాడని కేసు విచారణ జరిగితే మరల అదే నేరానికి అతనిపై మరియొక కేసు పెట్టరాదు. తప్పు చేసి నప్పుడు అది నేరం కాదు. దరిమిలా దానిని నేరంగా పరిగణిస్తూ శాసనం వచ్చిందనుకోండి. ఆ చేసిన తప్పుకు కేసు పెట్టకూడదు ఎందుకంటే ఆనాడు అది నేరం కాదు కనుక.

అన్నింటి కన్నా ముఖ్యమైనది జీవించే హక్కు. ఏ మనిషి స్వేచ్ఛను, లేక ప్రాణాన్ని శాసనం ప్రకటించిన విధానం ప్రకారం

తప్ప ఇతరత్రా హరించకూడదు. ఖూనీ చేసిన వానికి న్యాయస్థానం మరణశిక్ష వేయవచ్చును. దొంగతనం చేసిన వానికి కోర్టు జైలు శిక్ష వేస్తే అతనిని జైలులో పెట్టవచ్చును. అంతేకాని పోలీసువారు తీసుకొనివెళ్ళి కొట్టకూడదు, చంపకూడదు. "లా" ప్రకారంఇతరత్రా తమ ఆధీనంలోకి తీసుకోరాదు అంటే 'అరెస్టు' చేయరాదు. విచారణ లేకుండా ఏ వ్యక్తిని నిర్బంధించరాదు అని సూత్రం, కాని ధానికి మినహాయింపులు పెట్టారు. దేశభద్రతకోసం, ప్రశాంతికొరకు జైలులో పెట్టవచ్చు. అయితే నిర్ణయించబడిన గడువు లోపల నిర్బంధంలోకి ఎందుకు తీసుకున్నారో అతనికి లేక ఆమెకు తెలియచేయాలి. ఇంత కాలానికి కారణాల జాబితాను, కేసు రికార్డును ఒక సలహా సంఘానికి పంపాలి. వారి నిర్ణయం ప్రకారం రెండు సంవత్సరములు మించకుండా జైలులో ఉంచవచ్చును లేక విడుదల చేయవచ్చును. పోలీసు వారు ఎవరినయినా అరెస్టు చేస్తే వారిని 24 గంటలలోగా కోర్టులో హాజరు పెట్టాలి. కాకపోతే ప్రయాణానికి పట్టిన కాలం లెక్కకురాదు. ఇవన్నీ ప్రజల మౌలిక హక్కులు. వీటికి భంగం కల్గితే న్యాయస్థానాలకు పోయి పరిహారం పొందవచ్చును.

పైవన్నీ స్థూలంగా స్త్రీలకూ, పురుషులకు ఇద్దరికీ వర్తించే హక్కులు.

స్త్రీలు ఈ హక్కులను అనుభవిస్తున్నారా లేక అనుభవించ గలుగుతున్నారా అనే విషయాన్ని మున్ముందు చర్చిద్దాం. ఈలోగా స్త్రీలకు ఉన్న అదనపు సౌకర్యాలు, సదుపాయాలు ఏమిటి? అవి అలా ఇవ్వడం న్యాయమేనా అని ఆలోచిద్దాం.

వెనుకటి ఉత్తరంలో గర్భిణి స్త్రీలకు సెలవు, పోషణ వగైరాలను గురించి మాట్లాడాము. ఇపుడు క్రొత్తవిషయాలను ఎత్తుకుందాం.

స్త్రీలు తమకు సమానత్వం కావాలని అడగగానే కొంతమంది కుసం స్కారులయిన పురుషులు స్త్రీలకు వేరే మరుగుదొడ్లు ఎందుకు అనే వాదాన్ని కుతర్కంతో లేవనెత్తుతున్నారు. బస్సులలో ప్రత్యేకంగా సీట్లు ఎందుకు అంటున్నారు. రైళ్ళలో వేరే పెట్టె ఎందుకు అని వాది స్తున్నారు. పైకి ఈ వాదనలు సబబుగా ఉంటాయి, కాని నిజానికి ఇవి స్త్రీ జాతిపై ద్వేషంతో, కక్షతో చేసే వాదనలు. మర్మావయావ యాలను కప్పుకోవటం సభ్యత, సంస్కారం. అందుకనే మనం బట్టలు కట్టుకుంటున్నాం. ఏకాంతంలో భార్యాభర్తలు, ప్రేయసీ ప్రియులు కలిసే వేళల తప్ప తతిమ్మా వేళల్లో స్త్రీ పురుషులు బట్టలు వేసుకో కుండా తిరగరు ఇది అందరికీ తెలిసిన విషయమే, అయినా తెలియ నట్లు నటిస్తూ వాదించే వారిని ఏమనాలి. మలమూత్ర విసర్జన ఏకాం తంగా జరగవలసిన పనులు. అలాంటప్పుడు స్త్రీలు పురుషుల ఎదుట పురుషులు స్త్రీల ఎదుట దేహధర్మాలను నిర్వర్తించడం అసహ్యాకరం, ఇరువురికీ అవమానకరం. ఇలా వాదించేవారి మెదడును ఏదో పురుగు తొలుస్తున్నదని భావించాలి.

ఇక బస్సులు, రైళ్ళ విషయం. ఒకరిని మరొకరు తోసుకో కుండా, ఒకరి దేహం మరొకరి దేహానికి రాపిడి చేయకుండా ప్రయా ణము చేసే స్థితిని ప్రభుత్వాలు కల్పించాలి. బస్సులలో రైళ్ళల్లో ఒకటే వత్తిడి. దీని అవకాశం తీసుకొని ఇతరులను అవమానించడం ముఖ్యంగా స్త్రీలను వేధించటం గమనిస్తున్నాం. అసభ్యమయిన చూపులతో, బూతు కూతలతో, అవతలి మనిషి దేహాన్ని తాకడంతో, నెట్టడంతో, గిచ్చడంతో, త్రోసివేయటంతో స్త్రీలను శారీరకంగా మానసికంగా రైళ్ళల్లో, బస్సులలో పురుషులు కొందరు హింసించటం చూస్తున్నాం. అందువల్లనే స్త్రీలకు ప్రత్యేకసదుపాయాలను ప్రభుత్వం కల్పిస్తున్నది. ఇతర దేశాలలో ఇలాంటివి లేవే. బొంబాయిలాంటి

నగరాలలో స్త్రీలకు బస్సులలో ప్రత్యేక సీట్లు లేవే అని కొందరు వాదిస్తారు. అది నిజమే. పురుషులలో సభ్యత ఉన్నపుడు, బస్సులలో రద్దీ లేనప్పుడు, తగినంత సంఖ్యలో బస్సులు నడుస్తున్నపుడు అలాంటి కేటాయింపు అవసరం లేదు. అంతేకాదు, స్త్రీకి అవమానం జరిగితే అసభ్యంగా ప్రవర్తించిన పురుషుని ఆమె చెప్పుతో కొట్టగలిగినప్పుడు, ఆ సమయంలో బస్సులోని స్త్రీ పురుషులు ఆమెకు అండగా నిలబడి అతనిని శిక్షించ పూనినపుడు "రిజర్వుడు" సీట్లు స్త్రీలకు అక్కరలేదు. ఈ అంశాలను లెక్కలోకి తీసుకోకుండా మాట్లాడి ప్రయోజనంలేదు. పాశ్చాత్య దేశాలలో 70 సం॥ పైబడిన వృద్ధులకు. వికలాంగులకు మాత్రమే ప్రత్యేకంగా బస్సులలో సీట్లు ఉన్నాయి. దేశకాల పరిస్థితులను బట్టి సమానత్వ సూత్రాన్ని అన్వయం చేయాలి.

ఇక్కడ సమానత్వపు హక్కుయొక్క మూల సూత్రాన్ని గురించి కొంచెం ముచ్చటించాలి. సమానత్వం రెండు రకాలు. మామూలు పంపిణి పద్ధతిలో సమానత్వం. రెండవది దామాషా పద్ధతిన సమానత్వం. ఉదాహరణలు చెపితేగాని మీకు వీటి భావం తేలికగా తెలియదు. జైలులో ఖైదీలకు మనిషికి ఇంత అని భోజనం పెడ్తారు. తెలంగాణాలో అయితే మూడు రొట్టెలు, చిన్న గిన్నె అన్నం, పులుసూ ఇస్తారు. ఆంధ్రాలో అయితే ఇన్నిగ్రాముల తూకం కల అన్నం అని ఇస్తారు. అజీర్ణవ్యాధితో బాధపడేవాడికీ, భీముడిలా తినగల వాడికి ఇద్దరికీ సమానమైన పరిమాణంలో తిండి పెడతారు. ఇది తలసరి పద్ధతి. మన రాజ్యాంగంలో వయోజనులలో ప్రతి ఒకనికి ఒక వోటు అని ఇచ్చినట్లు. ఇక రెండవదాని విషయం కొంచెం జాగ్రత్తగా పరిశీలిద్దాం. మన కుటుంబమే తీసుకుందాం. భార్య, భర్త, పిల్లలూ ఉన్నారు ఆ ఇంట్లో. పిల్లలలో ఇద్దరు బలహీనులు తిండి

బాగా తినలేరు. ఇద్దరు బాగా తిండి పుష్టి కలవారు. తింటారు, పని చేస్తారు. ఆ ఇంట్లో తల్లి అందరికీ అన్నం పెట్టున్నదనుకోండి. ఆమె ఎలా ప్రవర్తిస్తుంది. అందరికీ కొలతపెట్టి తలా ఒక గిన్నెడు అన్నం పెడుతుందా? పెట్టదు. కొద్దిగా తినగలవారికి తక్కువ అన్నం పెట్టి, బాగా తిని హరించుకోగల పిల్లలకు కడుపునిండా కొసరి కొసరి వడ్డించి పెడుతుంది. భారతంలో ఒక కథ ఉంది. పంచ పాండవులకు కుంతీదేవి భోజనం పెడుతూ వాళ్ళు భిక్షటనంచేసి తెచ్చిన అన్నంలో సగం భీమునకు పెట్టి మిగతా సగం తతిమ్మా నల్గురికీ పెట్టేదట. అంటే ఆమెకు అందరిమీద సమానమైన ప్రేమ లేనట్లా? అందరిమీద సమానమైన అభిమానం ఉండబట్టే ఎవరికి ఎంత అవసరమో గమనించి పోషిస్తుంది ఆమె. అది తల్లిప్రేమ. రాజ్యాలు కూడా పౌరులను అలాగే చూడాలంటారు విషయం బాగా తెలిసినవారు, కొందరు దీనిని కమ్యూనిజమంటారు, మరికొందరు సోషలిజం అంటారు. ఇంకా కొందరు సహకార శ్రేయోరాజ్యమంటారు. పేర్లు ఏవైనా అసలు అంశం ఒకటే. అవసరాలనుబట్టి పోషణ, సౌకర్యం, అంతేకాని తలల లెక్కింపును బట్టికాదు.

ఈ పై సూత్రాన్ని స్త్రీ పురుషులున్న మన సమాజానికి వర్తింపచేస్తే మానవజాతి మనుగడకు ప్రధాన బాధ్యతను స్త్రీలకు, వేల సంవత్సరాలనుండి స్వేచ్ఛకు, సమానత్వానికి నోచుకోకుండా జీవిస్తున్న మహిళాలోకానికి అదనపు సౌకర్యాలు, సదుపాయాలు కల్పించటం న్యాయమని తేలుతుంది. మంచిపని అని తోస్తుంది.

అందువలనే విద్యావిషయకంగా స్త్రీలకు సీట్లు కేటాయింపు. రాజకీయకంగా శాసనసభలలో, పార్లమెంటులో సీట్ల రిజర్వేషను. ఉద్యోగాలలో కొంతశాతం వారికి వేరే ఏర్పాటు చేయడం, సామాజి-

కంగా వారికి అదనపు రక్షణ. సౌకర్యాలు కావాలని ఆలోచనాపరులు ఇటీవల కోరుతున్నారు. ఇవి స్త్రీల శ్రేయస్సుకు ఉపయోగిస్తాయని నా నమ్మకం. అమ్మా! మీరంతా దీని విషయం బాగా ఆలోచించండి

ఈ ఉత్తరం ముగించే ముందు మరొక అంశం మీదృష్టికి తెచ్చి ముగిస్తాను. ఈ పాటికి మీలోమీరు అనుకుంటూ ఉంటారు. "అమ్మాయి చదువుకున్నది. బాగానే వివరంగా వ్రాస్తున్నది. కాని ఆ అమ్మాయికి వాస్తవ విషయాలు తెలియవు. హక్కులను గురించి బడిలో పాఠం చెప్పినట్లు ఏకరువుపెట్టింది.ఎక్కడున్నాయి ఆహక్కులు మన జీవితాలలో? నిజమే, మీకలా తోచటం న్యాయమే. కాని, అమ్మా! నాకూ కొంత తెలుసు. నేనూ లోకం పోకడ గమనించాను; గమనిస్తున్నాను. దాని విషయం పరిశీలించినవారు దానిని గురించి వ్రాస్తే ఓపికగా చదివాను. ఒకటి కాదు. అనేక వందల గ్రంథాలు, మనదేశ స్థితిగతులే కావు. ఇతర దేశాలలో ఎలా జరుగుతున్నది తెలుసుకున్నాను. ఏదయినా, నాకు తెలిసినంతవరకు మీకు విశదీకరిస్తాను.

రాజకీయస్వేచ్ఛ :- రాజ్యాంగం స్త్రీలకు పురుషులకి సమానంగా వోటుహక్కు ఇచ్చింది. ఇప్పటి రాజ్యాంగం ప్రకారం 18 సంవత్సరాలు నిండిన ప్రతి పురుషుడికి, స్త్రీకి పంచాయితీనుండి పార్లమెంటుదాకా జరిగే ఎన్నికలలో వోటు చేసే హక్కు వచ్చింది. అంతకుముందు 21 సంవత్సరాలు నిండిన వారికి ఉండేది. ఈ హక్కు 1950 జనవరి 26 నుండి అమలులోకి వచ్చింది. దీనిని స్త్రీలు ఎలా వాడుకున్నారు. ఇప్పటికి అంటే ఈ 39 సంవత్సరాలలో ఏ ఒకటి రెండుసార్లు మాత్రమే తప్ప తతిమ్మా సందర్భాలలో వారు తమ భర్తలు లేక తండ్రులు, అన్నతమ్ముళ్ళు లేక కుమారులు చెప్పినట్లు వోట్లు ఇచ్చారు. నిజానికి కొన్ని ప్రాంతాలలో ఇప్పటికీ "వెంకయ్యా! నీ ఇంట్లో 3 వోట్లు ఉన్నాయి. ఒకటి నీదీ, రెండవది

పి భార్యదీ. మూడవది నీ తల్లిదీ. మూడు వోట్లు నాకే ఇయ్యి" అని అడగటం చూస్తున్నాం. వెంకయ్య భార్యను అభ్యర్థి పిలిచి "వెంకమ్మ గారూ! మీ వోటు నాకు వెయ్యండి" అని అడిగిన సందర్భాలు ఇంచుమించుగా లేవు. "నేను చెప్పిన వారికి వోటు వేయకపోతే నీవు నా ఇంట్లో ఉండద్దు పో" అని దబాయించిన మొగుళ్లు ఎంతమందో ఉన్నారు. ఇదీ స్త్రీల రాజకీయ స్వేచ్ఛ.

ఆర్థిక స్వేచ్ఛ:— కష్టజీవులలో భార్య, తల్లి, కూతురు పొలాల్లో పని చేస్తారు. వారి కూలిని ఇంటి యజమాని భర్త వసూలు చేసుకుంటాడు. కాస్తో కూస్తో ఆమె తలనూనెకు, రవికెకు బట్ట కొనుక్కునే నిమిత్తం ఉంచుతాడు ఆమె వద్ద. అంతే. ఆమె ఇవ్వటానికి నిరాకరిస్తే త్రాగివచ్చి ఆమెను తన్ని తగలేస్తాడు. ఇదీ సంగతి.

ఇక మధ్యతరగతి విషయం. స్త్రీలు ఇటీవల ఉద్యోగాలుచేసినెల సరి జీతాలు సంపాదిస్తున్నారు. కూతుళ్ళు తండ్రికి, భార్యలు భర్తలకు తల్లులు కుమారులకు అందజేస్తున్నారు. ఇది దరహంమీద జరుగు తున్న విషయం. అన్ని కుటుంబాలలో అలా జరుగుతున్నదని కాదు. కొందరు స్త్రీలు జీతమంతా మగని దోసిట్లో పోసి నెలఖర్చుల కోసం ఆయన ఎదుట దేబిరిస్తూ చేతులు చాచి నిలుచుంటే మరికొందరు పదో వంతు తమదగ్గర ఉంచుకొని మిగతాది భర్తలకు ఇస్తున్నారు. ఏదైనా ఆమె జీతం మీద ఎక్కువ పెత్తనం చలాయించేది పురుషుడే. అదీ గాక ఆస్తి సంపాదన విషయంలో, ఆస్తిపై అజమాయిషి సందర్భంగా ఆమె ప్రమేయం ఉండదు. ఇళ్ళు, స్థలాలు, పొలాలు, బ్యాంకులో డిపాజిట్లు, విలువగల సామానులు (టి. వి లు, రిఫ్రిజిరేటర్లు, వగైరాలు) అతని పేరనే ఉంటాయి. అవునుమరి ఆమె అతని సొత్తు అయినప్పుడు ఆమె సంపాదన, దానివల్ల లభించే వస్తుసామాగ్రి

స్థిరాస్తి అతనిదే కదా। ఎంత అన్యాయం.

ఇక ధనవంతులైన స్త్రీల స్థితి వారిపేర ఆస్తులుంటాయి. కాని పెత్తనం పురుషులది. వారు బంగారు పంజరాలలో రామచిలుకలు.

సామాజిక స్వేచ్ఛ :- ఈనాడు నగరాలలో స్త్రీ చీకటి పడితే ఒంటరిగా వీధిన నడిచే ప్రసక్తి లేనేలేదు. "ఏనాడు అర్ధరాత్రి స్త్రీ ఒంటరిగా నిర్భయంగా 'రోడ్డున' నడిచి పోగలదో అప్పుడే నిజమైన స్వరాజ్యం వచ్చినట్లు" అని ప్రకటించాడు మహాత్మాగాంధి. స్త్రీలను బస్సుస్టాండులలో వేధిస్తున్న యువకులపై పోలీసువారు కేసులు పెడ్తున్నారు. రెండురోజుల కొకసారి ప్రతి పెద్ద నగరంలో ఒక స్త్రీపై అత్యాచారం, మానభంగం జరుగుతున్నాయి. కసాయిమూకలు మూక ఉమ్మడిగా మానభంగాలు చేస్తున్నారు. రద్దీ ఉన్న ప్రదేశాలలో. బస్సులలో, స్త్రీలను అవమానిస్తున్నారు. సభలలో వేరు వేరు ప్రదేశాలలో స్త్రీలు కూర్చోవటం ఇప్పటికీ సాగుతున్నది. వీధిన పురుషుడు వస్తుంటే స్త్రీ దారి ఇచ్చి తప్పుకోవాలి. గ్రామాలలో స్త్రీలకు సంచార స్వేచ్ఛ కొంచెం ఎక్కువగా ఉంటుంది. వాళ్ళు పొలం పోతారు కనుక వారిపై పూర్తిగా ఆంక్షలు పెట్టటం కుదరటం లేదు. కాని చెరువులు, దేవాలయాలు, సత్రాలు, కుల తగాదాలు, గట్టు తగాదాలు వీటి అన్నింటిలో స్త్రీలను రానివ్వరు, మాట్లాడనివ్వరు,

కుటుంబంలో స్వేచ్ఛ :— అనేక కుటుంబాలలో భర్తలు భార్యలను దండించడం జరుగుతున్నది. చేతులతో, కాళ్ళతో, కర్రలతో, త్రాళ్ళతోను గొడ్లను బాదినట్లుబాదడం, చావగొట్టటంజరుగుతున్నది. ఎవరితోనైనా చెప్పుకుంటే ఆ ముసలమ్మ "ఏమిటే! చోద్యం చెబుతావు. మొగుడన్న తర్వాత తిట్టడా? కొట్టడా? దీనికింత రగడ చేస్తా

వుతే" అని మందలిస్తుంది. ప్రక్కింటివాళ్ళు చూస్తూ నవ్వుతారుగాని సాయంరారు. తోటి స్త్రీలు కూడా అంతే. అందువల్లనే కాబోలు, "మొగుడు కొట్టినందుకు కాదు, తోడికోడలు నవ్వినందుకు బాధ కలిగింది అనే సామెత పుట్టింది. ఇది స్త్రీల అజ్ఞానం వల్ల జరుగుతున్నది. పెండ్లి చేసుకుంది సఖ్యతగా కాపురం చేయడానికి కొట్టి చంపడానికి కాదు కదా! శారీరకంగా స్త్రీలపై దౌర్జన్యం సాగుతుంటే మానసికంగా చిత్రహింసలు చేసే వారున్నారు. తను పొలం పోతాడు కదూ, ఇంట్లో ఉండడాయె. ఇంటిలో ఉన్న భార్యపై అనుమానం. చీటికి మాటికీ ఆమెను నానా మాటలూ అంటూ, ఈసడిస్తూ, ఆమెను చిత్రహింస చేస్తాడు. ఇది మానసికదౌర్జన్యం. ఇక భార్యకు లైంగిక విషయంలో కూడా స్వేచ్ఛ లేదు. ఆమె ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా భర్త ఆమెను పొందవచ్చు. అది నేరం కాదట! ఆమెపై లైంగిక దౌర్జన్యం చేసినా తప్పులేదట. ఇంకో తమాషా విషయం. కోర్టుద్వారా ఉత్తర్వు పొంది వేరుగా కాపురం ఉంటున్న భార్యపై భర్త లైంగిక దౌర్జన్యం చేస్తే 2 సంవత్సరాలు జైలుశిక్ష. పరాయి స్త్రీపై లైంగిక దౌర్జన్యం చేస్తే 10 సంవత్సరాలు శిక్ష. అతడు ఎంత మంది పిల్లలను కనమంటే ఆమె అంతమందిని కనాలి. లేకపోతే ఇంట్లో నుంచి గెంటివేస్తాడు. అంటే భార్య, ఆమె దేహం, ఆమె మనస్సు అతని వస్తువులు. వస్తువుకు స్వేచ్ఛ ఉండటానికి వీల్లేదు కదా !

సాంస్కృతిక స్వేచ్ఛ :– భర్త వద్దంటే పెళ్ళికాగానే ఉద్యోగం మానాలి. అతడు కాదంటే పని మానివెయ్యాలి. అతడు వీల్లేదంటే చదువు ఆపివేయాలి. అతడు కాదు అంటె సంగీతం సాధన చేయ కూడదు. అతగాడు కూడదు అంటే ఆమె రచనలు చేయరాదు. చిత్ర లేఖనం సాగించరాదు. ఉపన్యాసాలు ఇవ్వరాదు. చివరకు ఉచితంగా

ఎవరికీ పాఠాలు చెప్పరాదు. అతనికి ఇష్టమైన దుస్తులు ధరించాలి. అతనికి ఘనసైనట్లు అలంకరించుకోవాలి. ఇలా ఎన్ని అయినా చెప్ప వచ్చు. అంటే ఆమె అతని చేతిలో కీలుబొమ్మ.

న్యాయసూత్రాలు స్త్రీలకు రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, కౌటుంబిక స్వేచ్ఛలను అంగీకరించాయి. రాజ్యాంగం ఆమోదించి స్థిరీకరించి ప్రకటించింది. కాని అవి వారికి అనుభవంలో ఈ నాటికి లేవనేది పచ్చి నిజం.

ఈ ఉత్తరం పెద్దదయింది. విషయం పెద్దది కనుక అలా వ్రాయక తప్పలేదు.

సీ స్వరాజ్యం

## ఏం చెయ్యాలి?

అమ్మా! ఇది ఈ సమస్యపై నేను వ్రాసే తుదిజాబు.

జాగ్రుతి అంటే ఏమిటో, చైతన్యం అంటే ఏమిటో తెలుసు కున్నాం. హక్కుల చరిత్ర తెలిసింది. హక్కులకూ బాధ్యతలకూ ఉన్న సంబంధం అర్థమయింది. స్త్రీల హక్కుల వివరణ మనస్సుకు హత్తింది. స్త్రీలకు జరుగుతున్న అన్యాయాన్ని, వారిపట్ల జరిగే వివక్షను గ్రహించాము. జాగృతి, చైతన్యం కల స్త్రీలు ఏమి చెయ్యాలి అనే దానిమీద ఇపుడు వ్రాస్తున్నాను.

అన్యాయం జరుగుతూంటే మనకేమని ఊరుకోగలమా? లేము. ఎందుకు? మానవులం కనుక. తోటి మానవస్త్రీయెడ దౌర్జన్యం జరుగుతూంటే చూచి సహించలేము. అయితే ఏం చేద్దాం. ముందు 'అన్యాయం, అక్రమం' అని ఎలుగెత్తి అరుద్దాం. తరువాత ఇలా

అరవతలచిన వాళ్ళను, అన్యాయాన్ని అన్యాయమని అనగలిగిన వాళ్ళను కూడ కట్టుదాం. అందరం కలసి కట్టుగా ఒక సంఘాన్ని ఏర్పాటు చేద్దాం.

సమాజంలో ఎన్నో అన్యాయాలు జరుగుతున్నాయి. అక్రమాలు చేస్తున్నవారు బలవంతులు, హింస సాగిస్తున్నవారు సమాజంలో పలుకుబడి కలవారు, ఇన్నాళ్లుగా పెత్తనం చేస్తున్నవాళ్లు. అలాంటి వారిని ఏ ఒక్క స్త్రీ ఎదిరించడం సాధ్యంకాదు. అలా ఎదిరిస్తే ఆమెను హతమారుస్తారు. ఆమె గొంతు వినపడకుండా ఆమె పీక నొక్కేస్తారు కనుక అలాంటి వాళ్ళందరం కలసి ఏ మంచి పని అయినా చెయ్యాలి చెడ్డ పనిని ఎదిరించాలి,

సంఘం నిర్మించుకోవటానికి మీరు అంగీకరిస్తారని తలుస్తాను. సంఘం పెట్టగానే సరికాదు. దానిని నడపటం కష్టం. నలుగురు మనుష్యులు కలిస్తే నాలుగు అభిప్రాయాలు వెలువడతాయి. అందరినీ కూడ కట్టుకు రావడం అంత తేలిక కాదు. సమస్యలను, విషయాలను సరిగా అవగాహన చేసుకుంటేనే అంటే అర్థం చేసుకుంటేనే అది సాధ్యం. కనుక వాటిపై విశేషంగా చర్చలు సాగాలి.

సంఘ సభ్యుల మధ్య మొత్తం మీద ఇంచుమించుగా ఒకే అభిప్రాయం వచ్చిన తరువాత ఆ అభిప్రాయాన్ని గ్రామంలోని స్త్రీలకు నగరంలోని మహిళలకు తెలియజేయాలి. వీటికోసం 'మీటింగులు' పెట్టాలి. ఉపన్యాసాలు ఇప్పించాలి. కరపత్రాలు అచ్చువేయించి పంచి పెట్టాలి. చిన్న చిన్న పుస్తకాలు ప్రకటించాలి. వీటి అన్నింటికి

తోడుగా వారానికి ఒక పేటలో, ఒక బస్తీలో, ఒక వాడలో, ఒక గూడెంలో నలుగురు స్త్రీలను చేర్చి వారిచేత మాట్లాడించి వాళ్ళ అభిప్రాయాలు తెలుసుకోవాలి. ఏసమస్యనయినామనంఎత్తుకుంటామో ఆ సమస్య యొక్క లోతు పాతులు వారికి తెలియజెప్పాలి. ఇంత జరిగిన తర్వాత అన్యాయాన్ని అప్పటికప్పుడు ఎదిరించగల ధైర్యం గల కార్యకర్తలను తయారు చేసుకోవాలి. అన్యాయం జరిగిందని తెలిసిందనుకోండి. ఉదాహరణకు ఒక పురుషుడు నిష్కారణంగా చావబాదుతున్నాడనుకోండి, అప్పుడు ఈ కార్యకర్తలు హుటాహుటిన అక్కడకు వెళ్ళి అతనిని "ఎందుకు మీరు ఇలాంటి దౌర్జన్యానికి పూనుకుంటున్నారు" అని గట్టిగా ప్రశ్నించాలి. ఇంతమంది ఆడ వాళ్ళు ఏనాడు తనఎదుట నిలబడి ఇంత నిబ్బరంగా తనను ప్రశ్నించ లేదు. కనుక అతడు తబ్బిబ్బవుతాడు. అతని మాట తడబడుతుంది. అప్పుడు లేని ధైర్యం తెచ్చుకుని "ఆమె నా పెళ్ళాం, నా భార్యను నా ఇష్టం వచ్చినట్లు కొట్టుకుంటాను, చంపుకుంటాను" అంటాడు. మనలో కాస్త వయస్సున్న ఆడవాళ్ళు "బాబూ! నీకు పిల్లనిచ్చి పెళ్ళి చేసింది ఏలుకోవటానికి కాని కొట్టుకోవడానికి, చంపుకోవ డానికి కాదు" అని చెప్పి అతనిని మందలించాలి. అతడు కొంచెం చలిస్తాడు. ఇంతలో యువతులు "మా అక్కమీద చెయ్యి చేసుకుంటే సహించం బావగారూ!" అని అరిస్తే అతడు వణికిపోతాడు. చుట్టూ కలయజూస్తాడు. అంతా ఆడంగులే. చివరకు దీనంగా భార్యవంక చూస్తాడు.

ఆమె "చెల్లాయిలూ! మీ బావగారు మారిపోయారు. ఇంక ఆయన నన్ను ఎప్పుడూ కొట్టరులే"అని అం టుంది.

బెదురు చూపులతో అతడు ఇంట్లోకి పోతాడు. ఇలాంటిది మనకు మొదటి గెలుపు. ఈ వార్త ఊరంతా నిముషంలో పాకుతుంది. దౌర్జన్యం చేసే మగవాళ్ళ గుండెల్లో గుబులు బయలుదేరుతుంది. వారు ఇతర పురుషుల సాయం కోరతారు. పెద్దవాళ్లు అతనినే చివాట్లు పెడతారు. చిన్నవాళ్ళు ఇలా భార్యమీద చెయ్యి చేసుకుంటే ముందు ముందు ప్రమాదం వస్తుందని హెచ్చరిస్తారు. దాంతో అతడు తన స్థానం ఏమిటో తెలుసుకొని ఇకనుండి మంచిగా ప్రవర్తిస్తాడు. ప్రతి గ్రామంలోను, ప్రతి పేటలోనూ అచ్చంగా ఇలాగే జరుగుతుందని కాదు, మనం అన్యాయానికి ఎదురు నిలిస్తే ఇలాంటివే జరుగుతాయని నా భావం.

ఎప్పుడయితే స్త్రీలు కట్టు అయినారని ఊరిలో తెలుస్తుందో ఊరిలో స్త్రీలపై అత్యాచారాలు, మానభంగాలు, బూతుకూతలు. ఎకసకాలు, ఈలలు, కేకలు అన్నీ ఆగిపోతాయి. ఆడవాళ్లు తమ వోట్లను మేము చెప్పిన వాళ్ళకే వెయ్యాలని శాసించరు. వారి కూలీ డబ్బులను, జీతాలను దౌర్జన్యంగా కాజేయరు. మహిళా సంఘాల ఉనికిని గుర్తిస్తారు. ఏదైనా ఊరు మొత్తానికి సంబంధించిన సమస్య వస్తే సలహా సంప్రతింపులకోసం మహిళా సంఘం వారిని పిలుస్తారు. సమాన హోదా ఇచ్చి మాట్లాడతారు. మామూలుగా పురుషుల సభలలో మాట్లాడుకునే బూతుమాటలు ఆగిపోతాయి. తగాదాల పరిష్కారం కోసం జరిగే పంచాయితీలకు స్త్రీ సంఘాల ప్రతినిధులను ఆహ్వానిస్తారు. ఆడపిల్లలను చదువుకోనిస్తారు. ఫస్టు మార్కులు వచ్చిన బాలికలకు బహుమతులిస్తారు. ఇలా గ్రామ వాతావరణం మారిపోతుంది. ఇదంతా నేను చెప్పినంత తేలికగా జరుగదు. చాలా కాలం పట్టుతుంది. రెండు మూడు సంవత్సరాలు పట్టవచ్చును. నిప్పు రవ్వ వెలగడమే కష్టం. తరువాత త్వర త్వరగా వ్యాపిస్తుంది కదా!

ఈ మహిళోద్యమం కూడా అంతే. ప్రారంభం కష్టం. సంఘ నిర్మాణం కష్టం. మొదటి గెలుపు కష్టం. తర్వాత అంతా నల్లేరు మీద బండిలా సాగిపోతుంది.

ఉద్యమపు మొదటి రోజుల్లో జాగృతి, చైతన్యం గల స్త్రీలు వీటిని తదితర స్త్రీలలో వ్యాప్తి చేయటానికి, సంఘ నిర్మాణానికి చాల కృషి చేయాలి. ప్రథమ కార్యకర్తలకు ఎంతో ఓపిక, ఓర్మి, పట్టుదల ఉండాలి. మొదట్లో వారికి ఎదురయ్యేది ఎగతాళి, హేళన, నిందలు మాత్రమే. బలపడిన తరువాత సమాజంలో సగభాగమయిన స్త్రీల బలం మహిళా సంఘంలో గూడు కట్టుకుంటుంది. అప్పుడు స్త్రీ శక్తిని చూచి అన్యాయం, అక్రమం. దౌర్జన్యం, హింస. దుర్మార్గం చేసే మనుషులు భయపడతారు. ఇది మన దేశంలోనే కాదు, అన్ని దేశాలలోను ఇలానే జరుగుతున్నది. కాకిపోతే కష్టపడి, సంఘాలు స్థాపించి పోరాటానికి సిద్ధపడి వాళ్ళకు కావలసిన హక్కులను సాధించుకున్నారు. బ్రిటీషు వనితల పోరాట ఫలితంగా వాళ్ళకు వోటుహక్కు వచ్చింది 1919లో. వాళ్ళు, తెల్లవాళ్ళు—మనను ఆనాడు పరిపాలిస్తున్నారు కనుక మన దేశంలో స్త్రీలకు కూడా వోటుహక్కు వచ్చింది.

స్త్రీ ధనం విషయంలో అంటే పెళ్ళినాడు అత్తవారు, పుట్టింటివారు పెట్టే సొమ్ములు, చీరెలు భార్యవనేది చాలాకాలం క్రిందట నుండి మన దేశంలో ఉన్నది. పాశ్చాత్యదేశాలలో మనకు పడమరగా నున్న తెల్లవాళ్ళ దేశాలలో పెండ్లి అయిన తరువాత స్త్రీ ఆస్తి భర్తకు చెందేది. ఆమె ఆస్తిమీద ఆమె తన హక్కును గట్టి చేసుకోడానికి — పెండ్లి తరువాత కూడా — ఆమె పోరాడక తప్పలేదు. ఆ హక్కును సుమారు 50 సంవత్సరాల క్రిందట మాత్రమే ఆమె గెలుచుకో కల్గింది.

ఫ్రాన్సు అనే పేరుగల దేశంలో భార్య ఫ్యాక్టరీలో పనిచేస్తే ఆమె జీతం భర్తకు చెల్లించేవారు. ఆ జీతం తనకే చెల్లించాలని పోరాడి ఫ్రెంచి వనితలు సుమారు 70 సంవత్సరాలనాడు గెలిచారు.

ఇలాంటి ఉదాహరణలు ఎన్నయినా చెప్పవచ్చును. ఆందోళన పోరాటం లేనిది ఎప్పుడూ ఏ మంచి ఉద్యమమూ జయించలేదు.

పోరాటం అనగానే హింసతో అనుకొని భయపడవద్దు. శాంతియుతంగాను, న్యాయంగాను చేసే పోరాట మార్గాలు అనేకం ఉన్నాయి. వాటిని స్త్రీలు చేపట్టాలి.

సాధించిన హక్కులు ఎన్నో ఉన్నా సాధించవలసినవి ఎన్నో వున్నాయి. కులమతాలకు అతీతంగా అందరికీ వర్తించే ఒకే ఒక వ్యవహార సంహిత అంటే ఒకే చట్టం కావాలి. అదే పెండ్లిని, వారసత్వాన్ని, సంరక్షకత్వాన్ని నిర్ణయించాలి. స్త్రీ దేహం మీద ఆమె సమ్మతి లేకుండా ఎవరికీ — చివరకు భర్తకు కూడా— హక్కు ఉండరాదు ఆమె ఇష్టం లేనిది ఇంతమంది సంతానాన్ని కనమని దబాయించటానికి ఎవరికీ హక్కు లేదు. ఆమెను కించపరిచే పద్ధతిలో ప్రవర్తించకూడదు. వరకట్నం పద్ధతి, ఓలి స్త్రీని తక్కువ చూపు చూస్తున్నాయి. పెళ్లి చేసుకున్నందుకు వరునికి కట్నం లంచమయితే కన్యమీద హక్కులు వదులుకున్నందుకు కన్య తండ్రికి లంచం ఓలి. రెండూ తప్పే. ఇలాంటి వెన్నో ఘోరాలు స్త్రీల యెడ జరుగుతున్నాయి. వీటిని ఆపుదాం. లోపాలతో ఉన్న చట్టాలను సవరణ చేయించుకుందాం. స్త్రీల స్థితిని బాగుపరుచుకుందాం. అదే మనం, అంటే జాగృతి, చైతన్యం కల స్త్రీలు చేయాల్సిన పని. అమ్మా! మీ రాత్రి బడిలో చదువుకునే మీ మీద నాకు పూర్తి నమ్మకం ఉన్నది. ఈ గొప్ప పనిని మీరు మాత్రమే చేపట్టగలరు

అమ్మా! మీరంతా దానికి పూనుకుంటారని ఆశిస్తున్నాను. అలా చేసిననాడే మనకు నిజమయిన స్వరాజ్యం వచ్చినట్లు.

పెద్దలయిన మీకు, జీవితానుభవం ఉన్న మీకు, చిన్న పిల్లలకు పాఠాలు చెప్పినట్లు ఇన్ని ఉత్తరాలద్వారా తెలియజేయటానికి సాహసించినందుకు నన్ను నీవు, మీ వాళ్ళూ అందరూ మన్నిస్తారు కదూ!

ఇట్లు
నీ స్వరాజ్యం.

మహిళా వికాసానికి

# మల్లాది సుబ్బమ్మ సాహిత్యం

| | | |
|---|---|---|
| చరిత్ర | 1. ఆం. ప్ర మహిళోద్యమం (1860–1983)రు. | 25–00 |
| విమర్శనాత్మక | 2. హైందవం : స్త్రీలు | 25–00 |
| గ్రంథాలు | 3. ఇస్లాం : స్త్రీలు | 15–00 |
| | 4. క్రైస్తవం: స్త్రీలు | 12–00 |
| వ్యాస సంపుటాలు | 5. సమస్యలు, సంస్కరణలు | 25–00 |
| | 6. మహిళా దశాబ్దం | 7–50 |
| | 7. స్త్రీ విమోచన | 7–50 |
| | 8. ఓ మహిళా ; ముందుకు సాగిపో | 7–00 |
| | 9. వనితాలోకం | 12–00 |
| | 10. మనం; మన సంస్కృతి | 12–00 |
| | 11. బానిసా కాదు, దేవతా కాదు | 10–00 |
| | 12. స్త్రీలపై అత్యాచారాలు | 7–00 |
| | 13. స్త్రీల హక్కులు: సమస్యలు | 6–00 |
| | 14. మత ధర్మశాసనాలు; మహిళలు | 8–00 |
| | 15. బంగారు సంకెళ్ళు | 10–00 |
| | 16. హేతువాదం; స్త్రీలు | 5–00 |
| | 17. లైంగిక విప్లవం | 4–00 |
| సంకలనాలు | 18. వివాహం: నేడు, రేపు | 20–00 |
| | 19. మహిళా వికాసం: శ్రమ, ఉద్యోగం | 15–00 |
| | 20 వివాహం సంతానం కోసమేనా? | 10–00 |
| | 21. వరకట్న విశ్లేషణ | 10–00 |
| | 22. స్త్రీల లైంగికత : లైంగిక స్వేచ్ఛ | 20–00 |
| | 23. అశ్లీలం; అసభ్యత | 15–00 |
| నవలలు | 24. వంశాంకురం | 20–00 |
| | 25. ప్రేమ+సెక్స్=నీతి | 17–00 |
| | 26. వెలిగిన జ్యోతి | 12–00 |
| | 27. కాంతి కిరణాలు | 12–00 |
| | 28. చీకటి వెలుగులు | 10–00 |
| | 29. ఈ దేశం నాదేనా? | 5–00 |
| కథలు | 30. మాతృత్వానికి మరోముడి | 20–00 |
| ప్రణాళిక | 31. స్త్రీ విముక్తి | 6–00 |
| | 32. **Atrocities on Women** | 30–00 |
| | 33. **Saga of Women's Struggle** | 10–00 |
| | 36. **Women's Liberation** | 10–00 |